# మల్యాల వంశ చరిత్ర - శాసనములు

బి. ఎన్. శాస్త్రి ఎం.ఏ

ప్రచురణ :

**హరిహర త్రిశక్తి దేవస్థానము**

వలిగొండ, జిల్లా నల్లగొండ.

ప్రథమ ముద్రణ : జూలై 1994
ప్రతులు : 2000



వెల : రూ. 100-00

ప్రతులకు :
**మూసీ పబ్లికేషన్స్,**
3-4-245/1, లింగంపల్లి,
హైదరాబాదు - 500 027.

ముద్రణ :
**పద్మశ్రీ ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380.
ఫోన్లు : 611413, 600547.

# మనవి

ఆంధ్రదేశమును పాలించిన రాజ వంశములలో కాకతి వంశము ప్రసిద్ధి గాంచినది. ఈ రాజ వంశీయులు సమగ్రాంధ్ర దేశము నేకచ్ఛత్రాధిపత్యముగ పాలించినారు వీరి సామంత, మాండలిక, మహా సామంతాధిపులలో మల్యాల, విరియాల, నతవాడి, గోన, కోన, రేచర్లరెడ్డి, చెఱుకురెడ్డి, వావిలాల, రేచర్ల పద్మనాయక, ఇందులూరి, కాయస్థాది రాజవంశముల వారు ప్రసిద్ధులు.

మల్యాల వంశీయులు, కాకతి రెండవ బేతరాజు కాలమునుండి రుద్రమదేవి పాలనాంతము వరకు నంకీసపుర, వర్ధమానపుర రాజ్యములను పాలించినారు.

ఈ వంశీయులకు సంబంధించిన 7 శిలా శాసనము లిప్పటివరకు లభించినవి. అందు కటుకూరులో నొకటి, కొండిపర్తిలో రెండు, వర్ధమానపురమం దొకటి, బూదపూరులో మూడు శాసనములు లభించినవి.

మల్యాల,విరియాల వంశీయులు సంబంధ బాంధవ్యములు కలవారు.విరియాల వంశోత్పన్న యగు మైలమ చౌండసేనాని నుద్వాహమయ్యెను. అట్లే గోన వంశమునకు చెందిన బుద్ధారెడ్డి తనయ, కుప్పాంబిక మల్యాల గుండదండాధీశుని వివాహమాడినది.

ఈ సామంతమాండలిక రాజవంశములవా రన్యోన్యముగ నుండి కాకతి సామ్రాజ్య రక్షాభారము వహించి, అనేక యుద్ధములందు పాల్గొని విజయములు సాధించి కాకతి ప్రభువుల మన్ననలకు పాత్రులైనారు.

కాకతి మహా సామ్రాజ్య మతి వైభవముగా వెలుగొందుటలో సామంత మాండలికరాజుల భుజబలము, శౌర్య ధైర్యములు ప్రధానముగ తోడ్పడినవి.

దన్న సేనాని రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజుపాలనా కాలమందును, సబ్బసేనాని ప్రోలరాజు, రుద్రదేవుల కాలమందును, కాటసేనాని రుద్రదేవ, గణపతి దేవుల కాలమందును, పోత చౌండ సేనానులు గణపతిదేవ చక్రవర్తి పాలనా కాలమందును, మల్యాల బాచసేనాని గణపతిదేవుని పాలనలోను, గుండదండాధీశుడు గణపతిదేవ, రుద్రమహాదేవుల కాలములందును సామంతులుగను దండనాయకులుగను పని చేసినారు. ఈ రాజన్యులవంశ చరిత్ర సంక్షిప్తముగ నీ గ్రంధమున రూపొందింపబడినది.

ఈ వంశీయులకు సంబంధించిన 7 శిలాశాసనములిందు ప్రకటింపబడినవి. ఈ రాజ వంశీయులకు చెందిన సంకీసపుర, వర్ధమానపుర రాజ్యములు వర్థిల్లిననాటి సాంఘిక చరిత్ర సంక్షిప్త రూపమున నిందు చేర్చబడినది. ఈ గ్రంథ రచనలో నాకు అనేక శాసన గ్రంథములు, వ్యాసములు తోడ్పడినవి. ఆయా గ్రంధకర్తలకు, వ్యాస రచయితలకు నా కృతజ్ఞతలు.

స్వాతంత్ర్య సమరయోధులు, నిరాడంబరులు, గాంధేయ సిద్ధాంతముల నమలుపరచు మహనీయులు, సహకారోద్యమమున ప్రధానపాత్ర వహించినవారు, గ్రంథాలయోద్యమ పితామహులు శ్రీ కోదాటి నారాయణరావుగారీ గ్రంథమును స్వీకరించుట కంగీకరించినారు. వారికి నా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

ఈ గ్రంథ రచనలోను, ముఖ్యపదానుక్రమణిక కూర్చుటలోను, ప్రూఫులు సరిదిద్దుట లోను, ఛాయా చిత్రములను రూపొందించుటలోను తోడ్పడిన కుమారి మనోహరికి, కుమారి మంజులకు నా ఆశీస్సులు.

ఈ గ్రంథము నతి త్వరితగతిని ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్, వారి సహచరులకు; ముఖపత్రమును, ఛాయా చిత్రములను చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ ఓం సాయి గ్రాఫిక్స్ యజమానులు శ్రీయుతులు రాంరెడ్డి, రాజశేఖరరెడ్డి గారలకు నా అభివందనములు.

సామంత మాండలిక రాజవంశముల చరిత్రలను గ్రంథరూపములో వెలికిదీయవలెనను నా ఆశయమున కనుగుణ్యముగా నిదివరలో కందూరి చోడుల శాసనములు చరిత్ర - సంస్కృతి, రేచర్ల రెడ్డి వంశచరిత్ర - శాసనములు, చెఱకు వంశచరిత్ర - శాసనములు, వేములవాడ చరిత్ర - శాసనములు, కాయస్థరాజులు అను గ్రంధములు ప్రకటించినాను. ఇది మల్యాల వంశ చరిత్రకు సంబంధించిన గ్రంథము. ఈ గ్రంథము నాంధ్ర మహాజనులు సమాదరింతురని ఆశించుచున్నాను.

—బి. ఎన్. శాస్త్రి

# విషయ సూచిక



—: o :—

# ఛాయా చిత్రములు – శాసన ప్రతిబింబములు

1. మల్యాల ఆలయ రథము; ధ్వజస్తంభము - మల్యాల.
2. దీప స్తంభము - మల్యాల; కల్యాణ మంటపము - మల్యాల.
3. గజములు - మల్యాల.
4. బలిపీఠము - మల్యాల; నంది - మల్యాల.
5. రామాలయ ముఖద్వారము - మల్యాల; సింహద్వారము - మల్యాల.
6. అమ్మవారు - సంకీస; అమ్మవారు, ఉత్సవ విగ్రహములు - సంకీస.
7. శివాలయము - సంకీస; శివలింగము - సంకీస.
8. రామాలయ సింహద్వారము - సంకీస, కల్యాణ మంటపము - సంకీస.
9. ధ్వజస్తంభము - సంకీస; సంకీస రథము.
10. ఆళ్వారులు - సంకీస.
11. సీతారామ లక్ష్మణులు - సంకీస; సీతారామ ఉత్సవ విగ్రహములు - సంకీస.
12. గరుడవాహనము - సంకీస, అశ్వవాహనము - సంకీస.
13. త్రికూటేశ్వరాలయము - కొండిపర్తి; నాగప్రతిమలు - సంకీస.
14. శిథిలాలయము - కొండిపర్తి; నంది - కొండిపర్తి.
15. కొండిపర్తి - శేషశాయి; గణపతి - కొండిపర్తి.
16. వీరగల్లులు - కొండిపర్తి.
17. శివపాదములు - శిల్పములు - కొండిపర్తి, శిథిల నందులు - కొండిపర్తి
18. వర్ధమానపుర దేవాలయము; శిథిల దేవాలయము - వర్ధమానపురము; వర్ధమానపుర దేవాలయము
19. వీరభద్రుడు - వర్ధమానపురము; వీరగల్లు - వర్ధమానపురము, నాగిని; నాగశిలలు.
20. వర్ధమానపురము - ఆలయము
    వర్ధమానపురము - అలయము
    ఆలయమంటపము; చెన్న కేశవాలయము; త్రికూటేశ్వరాలయము.

21. శివలింగము; వీరగల్లు; రథము; గణపతి, నంది
22. మైలమ కటుకూరు శాసనము 1-4 ప్రక్కలు.
23. చౌండసేనాని కొండిపర్తి శాసనము 1-4 ప్రక్కలు.
24. కాటసేనాని కొండిపర్తి శాసనము 1-4 ప్రక్కలు.
25. మల్యాల గుండదండాధీశుని వర్ధమానపుర శాసనము 1-4 ప్రక్కలు.
26. మల్యాల గుండన బూదపుర శాసనము 1-4 ప్రక్కలు.
27. గుండసేనాని బూదపుర శాసనము 1-4 ప్రక్కలు.
28. కుప్పాంబిక బూదపుర శాసనము.
29. శివాలయము - వర్ధమానపురము; వర్ధమానపుర దేవాలయము; **ఆలయ మంటపము.**

—: o :—

# అంకితము

పూజ్యులు,

నిరాడంబరులు,

స్వాతంత్ర్య సమరయోధులు,

సహకారోద్యమ నిర్మాతలు,

గ్రంథాలయోద్యమ పితామహులు

శ్రీ కోదాటి నారాయణరావు గారికి

ప్రేమాభిమానములతో

—బి. ఎన్. శాస్త్రి

# మల్యాల వంశ చరిత్ర – శాసనములు

**ఉపోద్ఘాతము :**

సమగ్రాంధ్ర దేశము నేలిన రాజవంశములలో కాకతి వంశము గణనీయమైనది. కాకతి సామంతులలో రేచర్ల రెడ్డి వంశజులు, చెఱకు వంశీయులు, మల్యాల, విరియాల, వావిలాల, నతవాడి, కోట, కాయస్థ, కోన, త్యాగి, ఇందులూరు, గోన, కందూరు వంటి వంశజు లెన్నదగినవారు.

కాకతి గణపతిదేవ చక్రవర్తి కాలమున మల్యాల వంశీయులు ప్రసిద్ధి గాంచియుండిరి. వారు మహా సామంతులుగ నుండి, సంకీసపుర, వర్ధమానపుర రాజ్యములను పాలించుటకు గణపతి దేవునిచే నియమింపబడి యుండిరి.

మల్యాల వంశీయు లపరిమిత పరాక్రమవంతులు, అజేయులు, అరివీర భయంకరులు. కాకతి సైన్యములకు నాయకత్వము వహించి అనేక యుద్ధములందు పాల్గొని విజయములు సాధించిన వారు. ఈ వంశీయులు కాకతి రాజధానీ నగరమగు ఓరుగల్లు పట్టణ రక్షణ బాధ్యతను వహించి యుండిరి.

కాకతి ప్రభువుల ఆదరాభిమానములకు పాత్రులై, ప్రముఖులుగా వ్యవహరింపబడిన మల్యాల వంశీయులు విరియాల వంశజులతో సన్నిహిత బాంధవ్యమున్న వారు.

మల్యాల వంశ ప్రభువులు కాకతీయుల సామంతులే యైనను వారు సంకీసపుర, వర్ధమాన పుర రాజ్యములను స్వతంత్రముగ పాలించి అనేక దేవాలయములను నిర్మించి, అగ్రహారముల నొసంగినారు. దేవాలయములందు నిత్య పూజలు, నిత్యారాధనలు, ధూపదీప నైవేద్యములు, అంగ రంగ భోగములు సక్రమముగా నిర్వహింపబడుట కనేక భూములను సువర్ణాది దానములను చేసినారు. బ్రాహ్మణులకు, వేదవేదాంగ వేత్తలకు అగ్రహారముల నొసగినారు. అనేక ప్రజాహిత కార్యములను నిర్వహించినారు. ఈ వంశీయులు నిర్మించిన ఆరామ తటాకాదులు, వరంగల్, ఖమ్మం, కరీంనగర్, మహబూబు నగర్ జిల్లాల యందు నేటికిని కనిపించుచున్నవి.

మల్యాల వంశమున పురుషులే గాక స్త్రీలు సైతము తమ భర్తల పేర, తల్లిదండ్రుల పేర ఆలయములను నిర్మించి భూదానము లొసంగినారు. అనేక మంది కవి పండితుల నీ వంశీయు

లాదరించినారు. దేవాలయములకు విప్రులకు భూదానము లొసంగుచు, శాసనములను ప్రకటించినారు. తటాకములను నిర్మించి ప్రజోపయోగ నిర్మాణము లనేకము చేపట్టి తమ కీర్తి ప్రతిష్ఠలు శాశ్వతముగ నుండునట్లు చేసుకొనినారు.

మల్యాల వంశజుల రాజధానులుగ వర్ధిల్లిన సంకీసపురము, వర్ధమానపురము లతి ప్రసిద్ధములు. సంకీసపురము నేటి ఖమ్మం జిల్లాలో డోర్నకల్ రైల్వే జంక్షన్‌కు చేరువలో నున్న గ్రామము. వర్ధమానపురము మహబూబునగర్ జిల్లాలోని బిజినేపల్లి మండల పరిధి వడ్డెమాను గ్రామము.

ఈ రెండు రాజధానీ నగరము లతి రమ్యముగను, మనోహరముగను, శిల్పకళా వైభవములతో నొప్పు దేవాలయములతోను, ఉత్తుంగ సౌధ రాజములతోను అలరారుచుండెడివి.

కందూరు చోడుల సామ్రాజ్యము క్షీణదశను పొందిన పిదప వర్ధమానపుర రాజ్యము గోన వంశపు రెడ్లకు కాకతి గణపతిదేవ చక్రవర్తి యొసంగి యుండెను.

గోన వంశజులలో గన్నయ లేక గన్నారెడ్డి ప్రముఖుడు. అతడు కాకతి రుద్రమకు కుడి భుజముగా నుండి అనేక యుద్ధములందు పాల్గొని గణపతిదేవ చక్రవర్తి మన్ననలకు, లభిమానమునకు పాత్రుడయ్యెను.

గోన గన్నారెడ్డి సోదరి కుప్పాంబిక. ఆమె మల్యాల వంశజుడును, బాచమాంబా బాచ వరాధీశుల తనయుడును నగు గుండదండాధీశుని పరిణయ మాడెను.

గోన గన్నారెడ్డి యనంతరము వర్ధమానపుర రాజ్యమును కాకతి గణపతిదేవ మహారాజు మల్యాల గుండన మంత్రి కప్పగించెను గుండదండాధీశుడు వర్ధమానపుర రాజ్యభారము వహించి కాకతి గణపతి దేవుని సామంతుడుగా వ్యవహరించెను.

మల్యాల వంశచరిత్ర నిర్మాణమున కా వంశీయులు వేయించిన శాసనములు, నిర్మాణములు, దేవాలయములు, దుర్గములు, శిథిల శిల్పసంపద, ఆనాటి కవుల రచనలు ఆధారభూతములుగ నున్నవి.

**శాసనములు :**

మల్యాల వంశీయులకు సంబంధించిన శిలాశాసనములు వరంగల్, కరీంనగర్,మహబూబు నగర్ జిల్లాలలో లభించినవి. అవి:

1. మైలమ కటుకూరు శాసనము శ.సం. 1124
2. చౌండసేనాని కొండిపర్తి శాసనము శ.సం. 1125
3. కాటసేనాని కొండిపర్తి శాసనము శ.సం. 1162
4. గుండదండాధీశుని వర్ధమానపుర శాసనము శ.సం. 1169
5. గుండసేనాని బూదపుర శాసనము శ.సం. 1184
6. గుండసేనాని బూదపుర శాసనము శ.సం. 1194
7. కుప్పాంబిక బూదపుర శాసనము శ.సం. 1196

ఈ శాసనములలో కొన్ని సంస్కృత భాషలోను మరికొన్ని సంస్కృతాంధ్ర భాషల లోను ప్రకటింపబడినవి.

ఈ శాసనముల వలన మల్యాల, విరియాల వంశములకు గల సంబంధ బాంధవ్యములు, మల్యాల వంశ చరిత్ర, ఆ వంశపు రాజులొనర్చిన ప్రజాహిత కార్యములు, యుద్ధములు తెలియు చున్నవి.

ఆనాటి కాకతి రాజుల, సాటి సామంతరాజులగు విరియాల, రేచర్లరెడ్డి, చెఱకురెడ్డి, తదితర రాజవంశపు రాజుల శాసనముల వలన మల్యాల వంశీయుల చరిత్ర నెరుగుట కవకాశ మున్నది.

## నిర్మాణములు :

మల్యాల వంశీయులు ప్రజాహితమును గోరి నిర్మించిన తటాకములు, ఆరామములు, తదితర కట్టడములు వారి దాతృత్వమును, నిర్మాణ కౌశలమును వెల్లడించనున్నవి. చౌండపురము, సంకీసపురము వంటి నిర్మాణములు అందు ముఖ్యమైనవి.

## దేవాలయములు :

మల్యాల వంశీయులు నిర్మించిన దేవాలయములన్నియు శైవమత సంబంధమైనవి. మైలమాంబ కటుకూరులో నిర్మించిన ఆలయములు, చౌండసేనాని, కాటసేనాని కొండిపర్తిలో కట్టించిన దేవాలయములు, వర్ధమానపుర మేలిన గుండదండాధీశుడు నిర్మించిన నాగేశ్వరాలయము, అతని భార్య కుప్పాంబిక బూదపురులో నిర్మించిన గుండేశ్వరాలయము మల్యాల వంశీయుల భక్తి ప్రపత్తులను తెలుపును.

## దుర్గములు :

సంకీస, మల్యాల, కొండిపర్తి, వర్ధమానపురములందు శిథిల రూపములోనున్న స్థల దుర్గములు మల్యాల వంశీయుల దుర్గ నిర్మాణ రీతులను తెలుసుకొనుటలో తోడ్పడును. కొండిపర్తి గొప్ప సైనిక శిబిరమునకు నెలవు. కాకతి రాజధానీ నగరమగు ఓరుగల్లు సంరక్షణార్థ మిచట సైన్య ముండెడిది ఆ సైన్యమునకు చౌండ సేనాని ఆధిపత్యము వహించి యుండెను.

వర్ధమానపురము కందూరునాడు లోనిది. పూర్వము కందూరు చోడుల రాజధానీ నగరము. కాకతి రుద్రదేవు డా పురముపై దండెత్తి దానిని విధ్వంస మొనర్చి యుండెను. కందూరు పాలకుడగు భీమదేవచోడుడు అమాత్య, బంధు సహితుడై మన్ననూరు అడవులందు దాగుకొని యుండ కాకతి రుద్రుడు వర్ధమానపురమును కాల్చివేసి మన్ననూరు అడవుల గాలించి భీమదేవ చోడునిబంధించి అతనిని తనసామంతుడుగ జేసుకొని అతని సోదరి పద్మావతీదేవిని వివాహమాడి యుండెను.

గణపతిదేవుని కాలమున వర్ధమానపురము పునర్నిర్మింపబడి గోన వంశజులకు, అటు పిమ్మట మల్యాల గుండదండాధీశున కొసగబడెను. మల్యాల గుండన మంత్రి వర్ధమానపురము నభివృద్ధి గావించి అనేక దేవాలయములను నిర్మించి రాజ భవనములను, ధాన్యాగారములను, దుర్గమును బాగుచేయించి, దానిని తన రాజధానిగా జేసుకొని పాలించెను.

సేనాధిపతులకు, మాండలికులకు, సామంతులకు, నట, విట, గాయక, కవి, గమికి, వాదివాగ్మి తదితరులకు ఆవాస భవనములను గుండదండాధీశుడు నిర్మించెను.

## శిథిల శిల్ప సంపద :

మల్యాల వంశజులు నిర్మించిన దేవాలయములలో కొన్ని నేటికిని నిలిచియున్నవి. వర్ధమానపుర మందలి నాగేశ్వరాలయము తదితర శివాలయములందలి శిల్ప సంపద అసాధారణ మైన రీతిలో నున్నది.

సంకీసపుర మందలి ఆలయములందున్న శిథిల శిల్ప సంపద, కొండిపర్తి, కటుకూరు లందు కాటయ, చౌండ సేనానులు మైలమ నిర్మించిన ఆలయముల శిల్పసంపద అపురూపమైనది.

మల్యాల వంశీయులు శిల్పకళాభిమానమునకు, దానధర్మములకు, భక్తి ప్రపత్తులకు ఈ ఆలయ శిల్ప సంపద తార్కాణముగ నున్నది. వర్ధమానపురమందలి నంది అపురూప శిల్ప కళాశోభితమై యలరారుచున్నది. వడ్డెమాను నంది పాలమూరు జిల్లాలో ప్రసిద్ధి గాంచిన

శిల్పరాజము. లేపాక్షి నంది, వనపర్తి, పిల్లలమర్రి, హనుమకొండ, రామప్ప దేవాలయములందున్న నందులు అపురూపమైనవి. ఇచటి వినాయక విగ్రహములు, కాలభైరవ, సప్తమాతృకల విగ్రహములు మనోహరముగ నుండి చూపరుల నాకర్షించును పార్వతీదేవి విగ్రహములు రమ్యాతిరమ్యముగ కనిపించును.

## కవుల రచనలు :

కాకతి రాజుల ఆస్థానమందున్న కవులు, మల్యాల వంశజులు వేయించిన శాసనముల కవులు, వారి రచనలు, వర్ధమానపుర సంకీసపురాధిపతుల చరిత్రల నెరుంగుటలో తోడ్పడును.

## ప్రజోపయోగ నిర్మాణములు :

మల్యాల వంశజు లనేక దేవాలయములను నిర్మించి తమ భక్తి ప్రపత్తులను ప్రకటించు కొనినను ప్రజాహిత కార్యములను నిర్వర్తించుటలో వెనుకంజవేయలేదు.

చౌండసేనాని చౌండ సముద్రమను తటాకమును, చౌండపురమును నిర్మించెను. మల్యాల గుండదండాధీశుడు తన తల్లి పేర బాస్సాని సముద్రమును, గణపతిదేవుని పేర గణప సముద్ర మును నిర్మించి వ్యవసాయాభివృద్ధికి తోడ్పడినాడు. అనేక పండితులకు, కవులకు భూసువర్ణాది దానముల నొసంగి వారి అభివృద్ధికి తోడ్పడినారు. అనేక రహదారులను భవనములను నిర్మించి తోటలను పెంచి ప్రజా సౌకర్యము లేర్పరచినారు.

## వంశ చరిత్ర :

మల్యాల వంశజులు కాకతి ప్రభువుల విధేయ సామంతులుగ నుండి కాకతి శత్రువులతో అనేక యుద్ధములందు పోరాడి విజయములు గాంచి కాకతి ప్రభువుల మన్ననలకు పాత్రులైనారు.

ఈ వంశమున కాద్యుడు దన్న సేనాని. ఇతడు పదముత్తుగండ బిరుదాంచితుడు. మల్యాల వంశీయులు దుర్జయ కులాన్వయులు. కాకతీయులు సైతము దుర్జయ కులోద్భవులు దన్నయసేనాని కిరువురు తనయులు. అందు సబ్బదండనాయకుడు జ్యేష్ఠుడు. సంకీసపురాధినాధుడు, రెండవ కుమారుడు బాచవరూధినీశుడు. ఇతనికి బెడముత్తుగండ బిరుదమున్నది. వర్ధమానపురవరాధీశ్వరు డగు గోన బుద్ధారెడ్డి వియ్యంకుడు. అపురూప శిల్పకళాశోభితములైన దేవాలయములను నిర్మించిన మహనీయుడు. ప్రజ్ఞావంతుడు. కదనరంగమున అజేయుడై శత్రువులను చెండాడిన శూరవరుడు.

సబ్బదండనాయకుని భార్య ఆచమ. ఈ దంపతుల తనయుడు కాటయామాత్యుడు. కోటగెలువాట, దివిచూరకార బిరుదములున్నవాడు. ఇతని కిరువురు భార్యలు. బొల్లమ, కాచమ యనువారు.

కాటయామాత్యున కిద్దరు కుమారులు. అందు పోతావనీశుడు జ్యేష్ఠుడు. రెండవవాడు సుప్రసిద్ధ కాకతి సేనానులలో నెన్నదగిన చౌండ సేనాని.

పోతసేనాని, చౌండసేనాని కాకతి గణపతిదేవ మహారాజు విధేయసామంతులుగను, ప్రసిద్ధ కాకతి సేనానులుగను కీర్తిప్రతిష్ఠలనార్జించి, కాకతి సామ్రాజ్య విధేయులుగ పరిగణింప బడినారు.

చౌండ సేనాని కాకతి గణపతిదేవ మహారాజు సైన్యముల కాధిపత్యము వహించి, దివిసీమపై దండెత్తి, చోడియ రాజునోడించి, దానిని వశపరచుకొని, ద్వీపిలుంఠక బిరుదమును వహించెను.

విరియాల వంశమునకు చెందిన ఐతమ అన్నయల ఏకైక తనయ మైలమ. మల్యాల చౌండ సేనానిని వివాహ మాడుటవలన విరియాల సామంత రాజ్యము మల్యాల రాజ్యమున విలీన మయ్యేను.

బాచవరూధినీశుని భార్య బాచాంబ. ఈ దంపతులకు గుండదండాధీశు డుదయించెను. అతడు బూదపూరు వర్ధమానపుర పాలకుడుగా నుండెను.

మల్యాల గుండ చమూపతి కాకతి గణపతిదేవ చక్రవర్తి సామంతుడుగను, దండనాయ కుడుగను వ్యవహరించెను. గోన బుద్ధారెడ్డి తనయ కుప్పాంబిక గుండదండాధీశుని అర్ధాంగి. ఈ దంపతులకు బాచబొప్పండు, గణపతిదేవండు, పర్వతమల్లు యను నందను లుదయించిరి.

గోనవంశమున సుప్రసిద్ధుడైన గన్నారెడ్డి కాకతి రాజ్య రక్షణాభారము వహించి యుండెను. అతడసహాయశూరుడు. అపరిమిత బలపరాక్రమవంతుడు. వర్ధమానపుర రాజ్యాధీశునిగ నుండినవాడు. అతని యనంతరము కాకతి గణపతి మల్యాల గుండదండాధీశునికి వర్ధమానపుర రాజ్యభార మప్పగించెను.

## దన్న సేనాని :

దుర్జయ కులమున జన్మించిన దన్నయ లేక దన్న సేనాని మల్యాల వంశమున కాద్యుడు. కటుకూరు శాసనమును ప్రకటించిన చౌండసేనాని భార్య మైలమ విరియాల వంశోద్భవ.

కటుకూరు శాసనమున విరియాల వంశముతో బాటు, మైలమ మెట్టిన మల్యాల వంశ వర్ణనము కూడ నున్నది. కటుకూరు కరీంనగర్ జిల్లాలోని గ్రామము. మైలమ ఈ శాసనమును

సంస్కృత భాషలో వేయించెను. ఇందు ఆమె భర్త చౌండసేనాని శక్తిసామర్థ్యములు, యుద్ధవిద్యా విశారదత్వము వర్ణింపబడినవి.

మల్యాల వంశమున కాద్యుడైన దన్నసేనాని కాకతి రాజుల కత్యంత ఆప్తవర్గములోని వాడు. ఈ మహనీయుని ప్రశంస మల్యాల వంశీయులు వేయించిన అన్ని శాసనములందును కనిపించును.

కటుకూరు శాసనమున[1] దన్నసేనాని "శిరః పురారేరివ చంద్రలేఖయా దివాకరస్యేవ రుచా దివస్థలం। య యోన్నతం దన్నయ మంత్రిణః కులం మనోజ్ఞ యా భూరి విభూషయిష్యతే। చమూపతే ర్దన్నయ నామధేయో॥"

నెలవంకచే శంకరుని శిరస్సు వెలిగినట్లు సూర్యుని కాంతిచే ఆకాశము వెలిగినట్లు మనోహరమైన ఈ మైలమ చేత ఉన్నతమైన దన్నయ మంత్రి కులము విభూషింప నున్నది అనియు

చౌండసేనాని కొండిపర్తి శాసనమున[2] "శ్రీమద్దుర్జయ వంశ వారిధివిధున్నిర్వ్యాజ బంధుస్సతాం, భూమౌ దంనప నామధేయ విదితో మల్యాలనాథో భవత్॥ కీర్త్యా యస్య సితీక్రితే దినకరే జాతే సుధాం శోస్సమే భేదద్యోతక మస్య లక్షణ మభూదన్వర్థ మేతాచ్చిరాత్। కిం తచ్చిత్రం పరహితరతాద్దంనసేనాధి నాథాత్సంత స్సేవా చతుర మతయః పార్థితార్థాన్లభంతే। సేవాహీనః సతత ముచిత ప్రార్థనాభి ప్రయుక్తో యస్మా దస్మాజ్జగతి లభతే ధర్మ్మశర్జో మహార్థాన్॥ కిం వాత్ర చిత్రం పెదముట్టుగండః స్వ బంధువర్గాయ యదదాతిదేయం। యస్మాన్నిహత్యాపి రిపూన్సవీరాన్దదాతితేభ్యః సురలోకరాజ్యం" అని దన్నసేనాని అభివర్ణింపబడినాడు. దన్నసేనాని బంధు జనుల నాదరించువాడు. వాహిన్యాధీశునిగను, సేనానిగను ఖ్యాతిని పొందినవాడు. పెదముత్తు గండ బిరుదమున్నవాడు.

శ్రీమంతమైన దుర్జయ వంశమను సముద్రమున చంద్రుడుగా జన్మించి భూమిపై దన్నయ నామమున వ్యవహరింపబడి మల్యాల వంశ ప్రభువైనాడు. ఈతని కీర్తిచేత తెల్లగా చేయబడిన సూర్యుడు అమృతాంశుడైన చంద్రునితో సమము కాగా భేదద్యోతకమే ఇతని లక్షణమై దన్నయ అన్వర్థమైనది.

---

1. A. P. Govt. Epigraphical series No. 3. pages 80 - 87.
2. వరంగల్ జిల్లా శాసనములు. శా. నెం. 48. పుటలు. 131 - 137.

ఇతరులకు మేలు చేయుటలో ఆసక్తుడైన దన్న సేనాపతి నుండి "సేవించుటలో చతుర మతులైన సజ్జనులు వారి అభీష్టములను పొందుచున్నారు. సేవాహీనుడైనను సముచిత ప్రార్థన చేసిన యెడల దన్న సేనాని నుండి గొప్ప సంపదలను పొందుననుట చాలా విచిత్రము.

పెదముత్తుగండ బిరుదాంచితుడైన దన్నయ బంధుసమూహమునకు అభీష్ట ఫల ప్రదానము చేయుననుటలో ఆశ్చర్య మేమి? మోర శత్రువులను చంపనప్పటికిని వారికి స్వరాజ్య పదవిని ప్రదానము చేయును అనగా రణమున చంపి స్వర్గమునకు పంపించును.

కాటసేనాని వేయించిన కొండిపర్తి శాసనమున[1] "ఆసీదాసీ క్రిత రిపుస్త్రీ లోచనః ఖేచరేంద్ర ప్రఖ్యః ప్రథన విజయీ సైన్యపోదన్నపాఖ్యః॥ దన్నస్య సైన్యాధిపతే ఙ్ఞ తాహో పరిస్ఫురంతి ఘన కాల యోగవతో శైత్యేనయుక్తా విదధేరిపూణాం సంతాపముగ్రంత రవారిధారా॥ ప్రసాదయామాస గుణాన్వరి దివ్యైప్యసౌ ఆక్రష్టుందిత్సయామాన్యేవ దాన్యంసుర భూరుహాన్" అనియు,

దన్నయ సేనాపతి యుద్ధము లందు విజయిగాను ఖేచరేంద్రుడు గాను విఖ్యాతుడై శత్రువులను చంపి శత్రు భార్యలను దాసీ జనులనుగా చేసుకున్నవాడు.

అహో! ఏమి ఈ దన్న సైన్యాధిపతి యొక్క పరాక్రమ పరిస్ఫురణము. తన చతురతచే వస్తువుల యొక్క తీవ్రమైన వేడి కత్తి యొక్క అంచును చల్లని దానిగ చేసిన అపార బలశాలి.

గుండదండాధీశుని శక సంవత్సరము 1167 నాటి వర్ధమానపుర శాసనమున[2] "దన్న సేనాని మల్యాల వంశతిలకః కలికాల కణ్ఠీరదన్నా హ్వయస్సమభ వద్భువనైకవీరః"

గుండనమంత్రి శక సంవత్సరము 1181 క్రీ.శ. 1259 నాటి బూదపురు శాసనమున[3] "అస్తి స్వస్తి మదులాగి మల్యాల కులమూర్జితం అగణితరిపున్నృపనికరో వితరణ గుణచణ గణే గణ్యః దన్యోదన్నయనామ సమజని నయ వినయ మయతను స్తస్మిన్॥"

---

1. వరంగల్ జిల్లా శాసనములు శా నెం. 64. పుటలు. 192 - 198.
2 మహబూబునగర్ జిల్లా సర్వస్వము పుటలు. 83 - 1026.
3. మహబూబునగర్ జిల్లా సర్వస్వము నెం. 84. 1033 - 1040.



మల్యాల ఆలయరథము



ధ్వజస్తంభము – మల్యాల



దీపస్తంభము - మల్యాల



కల్యాణమంటపము - మల్యాల

గొప్పదైన మల్యాల కులము కలదు. అందున అనేక శత్రు సమూహము కలవాడు, దాణగుణ ప్రవీణులైన వారి సమూహమున అగ్రగణ్యుడును నయ వినయ శీలుడును ధన్యుడును అగు దన్నయ పుట్టెను.

గుండదండాధీశునిదేయైన శకసంవత్సరము 1194 క్రీ.శ. 1272 నాటి బూదపుర శాసనమున[1] "మల్యాల వంశేకమలేక్షణాంశః దిగంత విశ్రాంత యశోవిలాసః శ్రీదన్న సేనాధిపతి ప్రసూతః॥"

మల్యాల వంశమున నారాయణాంశ సంభూతుడును సర్వ దిగంతాలలో నెలకొన్న కీర్తి విలాసము కలవాడును అగు శ్రీ దన్న సేనాని జన్మించెను.

దన్న సేనాని కల్పవృక్షము వంటివాడు. ఆశ్రితుల నాదరించి వారి కష్టములను దీర్చువాడు. సకల సద్గుణ సంపన్నుడు. నయ వినయ గుణములున్నవాడు. దిగంత విశ్రాంత యశోవిలాసుడు.

దన్న సేనాని కాకతి రెండవ బేతరాజు కాలమున ప్రసిద్ధుడై, కాకతి రెండవ ప్రోలరాజు కాలము వరకు సామంతుడుగను, దండనాధునిగను, మంత్రివర్యునిగను కీర్తిగాంచి యుండెను.

కాకతి రెండవ ప్రోలరాజు కల్యాణీ చాళుక్య ప్రతాపచక్రవర్తి రెండవ జగదేకమల్లుని ఆజ్ఞానువర్తియై నిర్వహించిన పొలవాస, మంత్రకూటము, కందూరు దండయాత్రల యందు మల్యాల దన్న సేనాని రేచర్ల, చెఱకురెడ్డి వంశజులతో పాటు పాల్గొని యుండును. కాకతి ప్రభువుల ఆదరాభిమానములకు పాత్రుడై సామంత రాజ్యమును పొంది సంకీసపురమును రాజధానిగా పాలించి యుండును.

దన్న సేనాని యుద్ధ వీరుడు. అరివీర భయంకరుడు. ఖడ్గవిద్యా విశారదుడు. దుర్జయ వంశజుడు. కాకతీయులు, వెన్గొండ వంశీయులు దుర్జజ కులాన్వయులే.

మల్యాల వంశమున దన్న సేనాని ప్రథముడుగ పరిగణింపబడుచున్నాడు. మల్యాల పేరుగల గ్రామములు తెలంగాణమునం దనేక జిల్లాలలో నున్నవి. కరీంనగర్ జిల్లాలోని హుజూరాబాదు తాలూకాలో నున్న మల్యాల, జగిత్యాల సమీపమందున్న మల్యాల, అదే జిల్లాలోని

2. మహబూబునగర్ జిల్లా సర్వస్వము నెం. 85. 1041 - 1048

నాగుల మల్యాల, ఖమ్మం, వరంగల్, నల్లగొండ జిల్లాలయందున్న మల్యాల గ్రామములు మల్యాల వంశజుల కాలమున వెలసినట్టివి.

దన్న సేనాని కాకతి ప్రభువుల ప్రాపకమున సామంత రాజ్యమును సంపాదించుకొని వారి సేనానులలో ప్రముఖుడై యుండెను.

## సబ్బ సేనాని :

దన్న సేనాని జ్యేష్ఠ కుమారుడు సబ్బవరూధినీశుడు. చౌండ సేనాని భార్య ఐలమ వేయించిన శక సంవత్సరము 1124 = క్రీ. శ. 1202 నాటి కటుకూరు శాసనమున[1] సబ్బ సేనాని "చమూపతే ర్దన్నయ నామధేయాత్స సబ్బ సేనాపతి రుద్బభూవ। పాత్రాప్పితే స్నేహ దశావ లంబాద్యోదీపి మల్యాల కుల ప్రదీపః॥ ఖండయన్రిపు చమూన్న కేవలం మండలాగ్రమ (స్ప) జయత్। దండ భృద్విపుల విక్రమోమ్మృధే మండలస్య చ నిజస్యయో మనః"

దన్నయ సేనాపతికి మల్యాల కుల ప్రదీపకుడగు సబ్బ సేనాపతి ఉద్భవించెను. సబ్బ సేనాపతి శత్రుసేనలను ఖండించుచు కేవలము తన మండలాగ్రమునే గాక దండదారియై విపుల విక్రముడై యుద్ధమున నందరి మనస్సులను రంజింప జేసెననియు,

చౌండ సేనాని శక సంవత్సరము 1125 = క్రీ. శ. 1203 నాటి కొండిపర్తి శాసనమున[2] సబ్బచమూపతి దంపతులు,

"తస్యాసీత్తనయః ప్రభూత వినయః శ్రీ సబ్బ సేనాపతిర్య స్మిన్సంగర రంగసంగిని రిపువ్రాత స్సమగ్రోపినన్। భీత్యాక్రాంత మతిర్విలోక్య సకలా స్వాశానుతం శస్త్రిణం నైవాలం చలితుం జహాతి సహసాతిష్ఠన్న సౌన్యోగివత్॥ వికచవిచకి లాభై రుల్ల సద్భిర్య శోభిర్జగతి ధవళితేస్మి న్సంకిసాదీశ్వరస్య। కథమపి కళయ తిస్పర్శ మాత్రాం దిదానీం ఖరకర హిమధామాద్యోత భేదం చకోరాః॥ చిత్రం యస్య ప్రకోపాగ్ని ర్జాయతే రిపు భూతిభిః। వర్ధతే వైరివాహిన్యాసద్య స్నేహేన శాంయతి॥ తస్యా భవత్ప్రియత మా చమనామదేయా యస్యాన్వభర్తరిజనః ప్రసమీక్ష్య భక్తిం। ద్వైపాయనాది మునివర్ణిత భక్తిభావం ప్రత్యేతి సంప్రతి సమస్త పతివ్రతానాం"

---

1 కరీంనగర్ జిల్లా శాసనములు పుటలు. 80 - 87.

2. వరంగల్ జిల్లా శాసనములు నెం 48 పుటలు 131 - 137

కాటసేనాని శక సంవత్సరము 116 = క్రీ. శ. 124 నాటి కొండిపర్తి శాసనమున[3] సబ్బసేనాని దంపతులు "తతోజని జగద్గీత కీర్తిః రాత్రిఃహర శ్రీశస్సబ్బ సైన్యేశః క్షీరాబ్దేరివ కౌస్తుభః॥ తస్య స్వచ్ఛయశః పురపూరితే। భువనత్రయే। కాగణ్ణాకాచయ నాయకః కపూఃరః కిమంజనం। ఆచమానామ తస్యాస్త్రీప్రియా కువలయేక్షణా। దే-శీల సంపత్యారుంధతీ తామ రుంధతీం। అన్యోన్య సామ్యం ప్రతిపద్యమానాజన్తై॥ రనుయంత మహానుభావాః। ఉమారమా విస్ఫుట మాచమాచ త్రిస్రోప్య జగ్రసంచరిత్తై రుదారైః"

దన్నసేనాని తనయుడు మంచి వినయశీలియగు శ్రీ సబ్బసేనాపతి నామకుడు శస్త్ర ధారియై నితడు యుద్ధరంగమున నిలువ శత్రు సైన్యము యొక్కఅడుగుకూడా ముందు వేయజాలక యోగివలె ఊరక నిలిచియుండును. కావున నిత డరివీర భయంకరుడు.

సంకిసాధీశ్వరుడైన సబ్బసేనాని కీర్తి వికాస కాంతులచే జగత్తు తెల్లని కాంతులతో గూడినదిగా చేయబడినది. కావుననే వెన్నెలను కోరు చకోర పక్షులు స్పర్శమాత్రముగా నెట్లో సూర్య, చంద్రకాంతుల భేదమును తెలుసుకొనుచున్నవి

వైరి విన్యాసముచే శత్రువులయొక్క అభ్యున్నతి సంపదల చూచినచో సబ్బసేనాపతి యొక్క కోపాగ్ని ప్రజ్వరిల్లును అట్టి కోపాగ్ని స్నేహముచే చల్లారును.

సబ్బసేనాపతికి ఆచమ నామదేయురాలు ధర్మపత్ని. మంచి పతిభక్తి పరాయణత గలది. వ్యాసాది మునులచే వర్ణింపబడిన భక్తిభావము కలిగి సమస్త పతివ్రతలలో తానొకతెగా వెలుగుచున్నది.

పాలసముద్రమున కౌస్తుభమణివలె జగత్తున పాడబడిన కీర్తిగలవాడు, ఆర్తిని హరించు వాడు అగు శ్రీ సబ్బసేనాని జన్మించెను. అతనియొక్క స్వచ్ఛమైన యశస్సు ముల్లోకములలో కర్పూరమై వెదజల్లగా ఇంకా నల్లదనము అనగా చీకటి లోకమం దేమాత్రము లేకుండెను.

సబ్బచమూపతికి కువలయాక్షి యగు ఆచమయను నామె భార్యగా నుండెను. ఆమె శీల సంపదచే అరుంధతిని పోలినదై, ఉదారమగు తన శీల సంపదచే అన్యోన్య సామ్యముగల ఉమ, రమ, ఆచమ ముగ్గురు సతులుగా అతని నానందింపజేసిరి.

3. వరంగల్ జిల్లా శాసనములు నెం. 64 పు. 192 - 198.




## కాటసేనాని :

సబ్బసేనాని తనయుడు కాటసేనాని. గొప్ప మేధావిగా కీర్తింపబడినవాడు. సంకీస పురాధినాధునిగా, మహా సామంతాధిపతిగా, కాకతి రాజ్యమున ప్రసిద్ధి వహించినవాడు. అతడు మైలమ ప్రకటించిన శక సంవత్సరము 1124 నాటి శాసనమున,[1]

1. కరీంనగర్ జిల్లా శాసనములు పుటలు. 80 - 87.



బలిపీఠము – మల్యాల



నంది – మల్యాల

"తతోజనిష్ట మేధావీ కాటయః సంకిసాధిపః। యత్పాణి మ్రగహీత్పూర్వ్వం వీర లక్ష్మీః కులస్త్రియాః। ఆవార్ధిః రాయగరుడః పెడముట్టుగండః ప్రఖ్యాత కోటగెలువాత ఇతి క్షమాయాం। ఆంధ్రాది సిద్ధజయ వాచక నామధేయైయ్యః స్యోన్నతిః కవిజనైః ప్రథయాం బుభూషే॥ ప్రేమైక విషయః శ్రీమాన్రుద్ర దేవస్య యో భవత్"

సంకిసాధిపుడు, మేధావి అగు కాటసేనాని సబ్బసేనానికి పుత్రుడుగా జన్మించెను. ఉన్నత కుల సంజాతులగు వీర వనితలు అతనిని పెండ్లియాడిరి. కాటసేనాని పెడముట్టుగండ, రాయగరుడ, కోటగెలువాట అను బిరుదములతో ప్రసిద్ధుడై యుండెను. విజయవాచకములైన నామములతో అతని అభ్యున్నతి కవులచేత విఖ్యాతమై విభూపించెను.

చౌండసేనాని శక సంవత్సరము 1125 క్రీ. శ. 1203 నాటి కొండిపర్తి శాసనమున[1]

"తస్యాం తస్యాభవత్పుత్రః ప్రఖ్యాతః కాటయాహ్వయః। ఆసీద్యద్గుణ మాణిక్య మంజూషా విదుషాం మనః। స్ఫితే యద్యశసాం చ మేదరదల సత్కుందేందు బింబద్యుతౌ సంప్రాప్తే ధవలీకృత త్రిభువనేస్థానం నిజం, నిమ్మలే॥ జ్యోత్స్నాశంకిమనా నిజసన సరోజాతస్య పత్రావళీం బాహుభ్యాం నమయే దధోముకులతా భీతో విధాతాధ్రువం। యత్తీక్ష్ణాన విదారిత ద్విపఘటా కుంభస్థల ప్రోచ్చలన్ముక్తా పంక్తియుతం వియద్రిపు నృపాదృష్ట్వాభయాన్మన్యతే। వీక్ష్యంతేవిమశాన్యుడూన్య హనిత న్నిస్సంశయో స్మత్క్షయం స్యాదేవేతి సకేన కోట గెల్వాతాఖ్యః సమః కధ్యతాం॥ నీతస్సురాసుర గురుప్రతిమం ప్రయోగే శౌర్యేః ధనంజయ దశానన వైరితుల్యం। తం స్వామిభక్తి విషయే పమం విదిత్వా శ్రీ రుద్రదేవ నృపతిర్వ్యః తనోదమాత్యం॥ తస్యా సీద్బొల్ల మాభిఖ్యా కామినీ ప్రేమ భాజనం। స్రిష్ట్వా యాం క్రితక్రిత్యోభూ ద్వేధా స్త్రీరూప సంపది॥ తయేషదుపమీయే తదానాంగ రుచిసంపదోః। చేతనా కల్పలతికా యదివిద్యుద చంచలా"

అచమయందు సబ్బసేనానికి ప్రఖ్యాతుడైన కాటయ నామకుడైన పుత్రు డుదయించెను. విద్వాంసుల మనస్సు ఈ కాటసేనాని యొక్క గుణగణములకు నిలయమగు మంజూష (పెట్టె) గా విలసిల్లినది. అనగా కాటసేనాని గుణములు విద్వాంసుల మనస్సుల నాకర్షించినవి.

కాటసేనాని దట్టమైన యశస్సు చంద్రకాంతియై వెదజల్లగా ముల్లోకములును తెల్లగా చేయబడి నిర్మలత్వమును పొందినవి. అట్టి యశశ్చంద్రకాంతిలో ఆశంకించుచున్న మనస్సు కలవాడైన విరించి తన ఆసనమగు పద్మము ముడుచుకొనగా భీతిల్లెను.

1. వరంగల్ జిల్లా శాసనములు నెం. 6 పుటలు. 131 - 137.

కాటసేనాని తీక్ష్ణమైన కత్తిచే ఛేదింపబడిన ఏనుగుల కుంభస్థలములనుండి పైకెగసిన ముత్యముల పంక్తిని ఆకాశమందున్న వాటిని శత్రురాజులు గాంచి భయభ్రాంతులై ఆ ముత్యములు పగటిపూట చుక్కలుగా దోపగా నిస్సంశయముగా వారి క్షయము తప్పదని తలంచిరి ఇట్టి అరివీర భయంకరుడై కోట గెల్వాత బిరుదము పొందుటలో సాటి ఎవరున్నారు?

సురాసుర గురువులైన బృహస్పతి, శుక్రులతో సమానుడును, శౌర్యమున అ, రామార్జును లతో సమానుడునగు కాటసేనాని స్వామిభక్తిపరాయణులలో నిరుపమానునిగ భావించి, కాకతి రుద్ర భూపతి కాటసేనానిని తన అమాత్యునిగా నిర్ణయించెను.

కాటసేనానికి సురూపవతియైన బొల్లమాంబ ప్రేమపాత్రురాలగు భార్యగా నయ్యెను. చేతసత్వముగల కల్పలతగా చాంచల్యములేని మెరుపుగాసు రూప లావణ్యములచే విలసిల్లు ఈ బొల్లమాంబను సృజించిన హేతువుచే బ్రహ్మదేవుడు స్త్రీ రూపసంపదను సృష్టించుటలో కృతకృత్యు దయ్యెను.

కాటయసేనాని స్వయముగా వేయించిన శక సంవత్సరము 1162 నాటి కొండిపర్తి శాసనమున[1] "శ్రీమాన్కాట చమూనాథస్తయోరాసీత్తనూభవః। ప్రతాపాక్రాంత దిచ్చక్ర హరిదశ్వ ఇవాపరహ॥ సకోట గెల్వాత ఇతి ప్రసిద్ధోనిధి........ధి ప్రమదావిభూషః। తమేవమాహుః పెదముట్టు గండ ముద్దండ యుద్ధాంగణ పండితిమ్నా॥ పరిస్ఫురంతి సమరాంగణేషు తస్యాసీధారారిపురక్త రక్తా। వ్యలోకి లోకై రతి విస్మయేన తీవ్ర ప్రతాపాగ్ని శిఖేవ మూర్తా ॥ తస్యారివీరాస్సమరేషు కుంభికుంభస్థలాగ్రే కృత దీర్ఘ నిద్రాః॥ జుజృంభిరే స్వర్గ విలాసినీనాం హంత ప్రబుద్ధాః కుచమండలేషు। తస్య ప్రతాపశిఖి ప్రాసాదేషు విరోధినాం। తృణాన్యుద్భా విదానితి నిత్యం లోకోవినస్మమే। సంకేతం సంకిసాధీశమర్థినామర్థితార్థదం। యస్యాః ప్రపుల్ల కుసుమం జంగమంకల్ప పాదపం॥"

సబ్బసేనాని దంపతులకు కాటసేనాని పుత్రుడుగా నయ్యెను. ఇతడు స్వప్రతాపముచే న్నాకమించుకొనిన దిక్చక్రములు కలవాడై రెండవ సూర్యుడా అన్నట్లు వెలిగెను. కోట గెల్వాత బిరుదాంచితుడుగా ప్రసిద్ధుడైన నితడు ప్రమదలకు మంచి విభూషణమునై విలసిల్లెను. అంతియేగాక పెదముట్టు గండడుగా ఉద్దండ యుద్ధ పండితుడుగా ఈతనిని వ్యవహరింతురు. యుద్ధభూములందు లోకులకు విస్మయము కలిగించునట్టి తీవ్ర ప్రతాపాగ్ని జ్వాలవలె రూపుదాల్చిన ఈతని కత్తి అంచు శత్రురక్తముచేత ఎఱ్ఱనైనదై తోచును. ఇతని శత్రువీరులు యుద్ధము లందు ఏనుగుల కుంభస్థలముల

1. వరంగల్ జిల్లా శాసనములు Vol. 6, పుట 192 - 198.

పైననే దీర్ఘనిద్రకలవారై సర్వలోకములోని దేవతాస్త్రీల స్తన మండలములపైకి విజృంభించిరి. ఇదెంత ఆశ్చర్యము?

ఈతని ప్రతాపాగ్ని జ్వాల శత్రువుల భవనములలో తృణాంకురములను కాల్చి వేసినది. సంకీసాధీశుడగు కాటయసేనాని యాచకజనమునకు కోరిన కోరికలను దీర్చుటలో కల్పతరువై విరాజిల్లెను.

కాటసేనాని నిర్మించిన త్రికూటేశ్వరాలయము మహోన్నతమైనది. ఈ ఆలయము వాస్తు శాస్త్రము ననుసరించి నిర్మించినట్టిది. ఈ ఆలయము అతుకులు కనిపింపకుండ నల్లనరపు బృహ త్శిలలతో నిర్మింపబడినది. స్తంభములు, దూలములు నునుపుగా చెక్కి శిల్ప శోభలతో నలరారు నట్లును, ఆలయ ప్రాకార కుడ్యము లతి మనోహరముగా నుండునట్లును రూపొందింపబడిన ఈ దేవా లయ శిల్ప మనల్పము.

కాటసేనాని శక్తి సామర్థ్యములను పరాక్రమాతిశయములను వర్ణించిన కొండిపర్తి శాసనమందతని దేవేరి కాచాంబిక పతివ్రతగా పేర్కొనబడినది. కాచాంబిక పాదముద్రికలు తనపై నుండుట వలన భూమి రత్నగర్భయైనట్లు తెలుపబడినది.

## పోతసేనాని :

కాటసేనాని జ్యేష్ఠపుత్రుడు పోతసేనాని. చౌండసేనాని ప్రకటించిన శక సంవత్సరము 1125 నాటి కొండిపర్తి శాసనమున[1] "తయోః పోతాభిదః సూనుచ్చా నుబ్జాంధు స్సరోరుహాం। రత్న సూనుస్సదా స్థైర్యే కామధేను ర్ధ నార్థి నాం। యస్యస్ఫార స్ఫురిత యశసః శాత ధారాసి ధేనుర్యు ద్ధేరీణాం పిబతి రుధిరం మాంసమత్తి ప్రకామం। యేషాం దృష్టం నయన యుగళే వారి వక్త్రే త్రిణంవా సద్యస్తేభ్యో భవతి విముఖీ దేను ధర్మ్మం విహాయ"

కాటసేనాని దంపతులకు పోతసేనాని పుత్రుడై బంధువులను, పద్మములను రంజింప జేయు భానుడై అలరారెను అతడు స్థైర్యమున రత్నముయొక్క బిడ్డగా, యాచకులకు ధన దానము చేయుటలో కామధేనువుగాను పేరొందినాడు. విస్తారమైన యశస్సుచే ప్రకాశించువాడైన పోతసేనానియొక్క పదునైన అంచుగల కత్తి అను ధేనువు యుద్ధసన్నద్ధులై వచ్చిన వారి రక్తమును స్వేచ్ఛగా త్రాగుచు మాంసమును భక్షించును. ఎవరి కన్నులలో నీరు కనబడునో,

1. వరంగల్ జిల్లా శాసనములు నెం. 48. పుట 131-127

ఎవరి ముఖములో దైన్యము అగుపించునో వారినుండి పరాఙ్ముఖియై విడిచివేయును. అనగా పోతసేనాని అరివీర ధీరుడు దీనజన బంధువని భావము.

పోతసేనాని తన మరదలును, చౌండసేనాని ధర్మపత్నియునునగు ౹ైపెంమ వేయించిన కటుకూరు శాసనమున[1] "తస్య వీరావజాయేతాం కల్రతే ప్రథమే సుతౌ॥ పోతాభిధానః పృథనాధి పోగ్రజస్త యోరభూద్యస్య కృపాణ సంచరః। యుద్ధాధ్వనునాకము పేయుషాం ద్విషాం యత్రా సమర్థో౽జనిసార్థవాహకః"

పోతసేనాని సేనాధిపతులలో తొలుత పేర్కొనబడినవాడై యుద్ధరంగమున ముందుగా కత్తిని చేబట్టి నడుచుచు యుద్ధమార్గము ద్వారా స్వర్గమును పొందగోరు శత్రువులను ఆ యాత్రా సాఫల్యమును చేకూర్చుటలో సమర్థుడు, సార్థవాహకుడునై యుండెను.

పోతసేనాని గొప్ప వీరుడు. కాకతి గణపతిదేవ చక్రవర్తి కడ ప్రసిద్ధ సేనానిగా నున్న చౌండసేనాని పోతసేనాని సోదరుడు. చౌండసేనాని కాకతి సేనల కాధిపత్యము వహించి దిగ్విజయ యాత్రలు సల్పుచుండ, పోతసేనాని నిజ సామంత రాజ్యమును పాలించుచు కాకతి రాజధానియగు ఓరుగల్లు సంరక్షణార్థము నియమింపబడిన సైన్యమున కాధిపత్యము వహించి యుండెను.

గణపతిదేవ చక్రవర్తి ఈ మల్యాల వంశ శాఖవారికి సంకీసపురాధిపత్య మొసంగి సామంత రాజులుగ పరిగణించెను. సంకీస పురము నేటి ఖమ్మం జిల్లాలోని సంకీస గ్రామము డోర్నకల్ రైల్వే జంక్షన్‌కు చేరువలో నున్నది. సంకీస హనుమాండ్ల సంకీస గ్రామముగా వ్యవహరింపబడుచున్నది.

పోతసేనాని కాటసేనాని జ్యేష్ఠ పుత్రుడు కావున మల్యాల సామంత రాజ్యము నేలుచు గణపతిదేవ చక్రవర్తి కనుసన్నలలో మెలగుచు కాకతి రాజధానీ నగర సంరక్షణ భారము వహించి యుండును.

## చౌండసేనాని :

మల్యాల వంశ ప్రభువులలో చౌండసేనాని అపరిమిత బలపరాక్రమ సంపన్నుడు. కాకతి గణపతి దేవ చక్రవర్తి విజయములందు తోడ్పడినవాడు- గొప్ప వీరుడు - అరివీర భయంకరుడు. కాకతి సేనల కాధిపత్యము వహించి దివి సీమపై దండెత్తి చోడియరాజు నోడించి అతని

1. కరీంనగర్ జిల్లా శాసనములు నెం. 80 పుట 80.87.



అమ్మవారు - సంకీస



అమ్మవారు ఉత్సవ విగ్రహములు - సంకీస

కడనున్న వెలనాటి పృథ్వీశ్వరుని ధనాగారమును కైవస మొనర్చుకొని కాకతి గణపతిదేవున కప్పగించిన శూరశిఖామణి.

చౌండ సేనాని విరియాల వంశజయైన మైలమను వివాహమాడి విరియాల, మల్యాల మహా సామంత రాజ్యములను పాలించినవాడు.

మైలమ చౌండ సేనానిని ప్రశంసించుచు కటుకూరు శాసనమును ప్రకటించెను అందు విరియాల, మల్యాల వంశములు వర్ణింపబడినవి.కటుకూరు శాసనమున[1] చౌండ సేనాని "యోనంతర శ్చౌండ వరూధినీశస్సురేజ్యధీ ర్విక్రమ కార్తికేయః। సుదండనీతిం తమఖండశక్తి మమాత్య కృత్యేవృత రుద్రదేవః। తమేషా సంకిసాధీశ వంశ వారాశి వర్ధనం। రోహిణీ వజనానంద మిందుం వవ్రే పతిం సతీ॥ యస్మిన్నూర్జిత విక్రమే గణపతి క్షోణీపతేః శాసనాజ్జేతుం దక్షిణవారిధిం జిగిమిషౌ చేలుమ్మర్ణానాం సిద్విషాం। కించోద్యోగ నియోగవేగిత చమూ యాత్రా భరాభుగ్నయా భూయోభూరి పరాభవో జలనిధే రువ్వార్ణసమాశంకితః యస్మై ప్రస్పంద దాటీ తురగ ఖుర పుట క్షేప నిర్భిన్న భూమేరుడ్డీ నైర్ధూర్ణలి జాలైరదిరల మఖితశ్చంన సౌర ప్రకాశైః। మామేష ప్రాప్త రోష స్థలయతి పరితః కిన్వితి వ్యగ్రితోర్ద్ధి ర్ద్వీపం ప్రాద దనేకై రుపచిత మణిభిశ్చోల భూపైశ్చ సార్ధం॥ అత్తర్ద్వీపశ్రియః శశ్వద భూన్మత్సరిభేదినీ యస్య కీర్తి మయీ దీవిమాలి కాండీ తికహలా"

కాటసేనాని రెండవ కుమారుడైన చౌండసేనాని బృహస్పతివంటి బుద్ధిగలిగి పరాక్రమమున కుమారస్వామియై వెలిగెను గొప్ప దండనీతి అఖండ శక్తిని గలవాడై కాకతి రుద్రదేవునికి అమాత్యకృత్యమును నిర్వహించినవాడు.లోకానందుడైన చంద్రుని రోహిణి వరించినట్లు సంకిశాధీశ వంశ సముద్ర సంభవుడైన శ్రీ చౌండసేనానిని మైలమ మానినీ రత్నము పతిగా గ్రహించెను.

మహా పరాక్రముడైన ఈ చౌండసేనాని గణపతి భూపతి శాసనముతో తన ప్రచండ సేనా యాత్రను నెఱపి దక్షిణ సముద్రమును భేదించెను. శత్రువుల హృదయములను భీతిల్లజేసెను.

అత్యంత గమనవేగము కలిగిన ఆతని గుఱ్ఱములయొక్క కాలిగెటికల తాకిడికి పగిలిన భూభాగమునందు పైకి లేచిన దుమ్ము కణముల చేత పరిసరముల సూర్యకాంతి సర్వము మిక్కిలి

---

1. కరీంనగర్ జిల్లా శాసనములు. పుటలు 80-87.

కప్పబడిన కారణమున ఆ సముద్ర ద్వీపము తనను పొందగోరి రోషము నందినాడని తెలిసికొని స్థానము నిచ్చుచు, సమకూర్చిన మణులతో చోళ భూపాలురతో తన ద్వీపము నాతనికి నొసంగెను. అనగా చోళ భూపాలు నోడించి ద్వీపమును వశపరచుకొనెను.

గెలిచిన ద్వీపమును ఆశ్రయముగా కలిగిన ఆ చౌండ సేనాని యశోమయమైన చీవి చూఅకార బిరుదము కాహళయై, శాశ్వతముగా శత్రుమత్సర నిర్మూలనకారి యైనది.

చౌండ సేనాని స్వయముగా శక సంవత్సరము 1125 లో వేయించిన కొండిపర్తి శాసనమున చౌండ సేనాని అతని భార్య మైలమ "తస్యానుజో లసత్తేజస్సహజై గ్గుణభూషణైః భూషితశ్చౌండసేనాని జ్జనానంద సుధాకరః। మల్యాలనాథ విమలాన్వయ సంభవస్య యస్యోర యోగతిభియో నిమిషం పురస్థాః। చిత్రం భవంతి సమరేధికలాభ భాజో యత్పంచతాం త్రిదశతా మపియాంతి భూయః। యస్య శ్రీ మద్గణపతి మహీపాల సేనాధి పత్యుః స్ఫారై స్సాద్రైః కుంద విశదై ర్యల్ల సద్భియ్యశోభిః। హైమాజాండం భరితవాభితః స్వర్ణ్ణశాలీ నిమ్మణాశాంబ్రవః పూర్ణ్ణ స్వర్ణ్ణ ప్రతగు కుతుపాకార మూరీకరోతి॥ శక్తేనరహితకరే సేవితానంత భోగే సర్వో పేతే ద్విజహిత రతేత్రాత గోమండలేచ। ప్రేమోవచోద్ధృతి మతియుతే చౌండసేనాధినాథే లక్ష్మిస్సాక్షా ద్వసతి సతతం ప్రీతి యోగేనయత్ర॥ అర్థిభ్యః ప్రార్థితా దధికమ విరతం వస్తు జాలం దదానం భూలోకే చౌండ సేనాపతి మముగుణై స్సాకమేకం విధాయ। ధాతానా కైక భోగ్య త్రిదశత రుమరుద్దేను చింతామణీనాం నిమ్మాణ ప్రాప్త నిందాం త్రిజగతి వితతా మార్జ్మనో నిమ్మామార్జ్జ"

పోతసేనాని సోదరుడు చౌండసేనాని సహజములైన గుణభూషణముల చేత శుభ్ర తేజోవంతుడు. జనుల కానందము నిచ్చుటలో చంద్రుడై ప్రకాశించెను. ఈ మల్యాలనాథుని నిర్మలమైన వంశములో పుట్టిన చౌండసేనానిచే వధింపబడి స్వర్గస్థులైన శత్రువులు కూడ మిక్కిలి భీతచిత్తులై అతని యుద్ధ కళా చాతుర్యమును తలంచుచు మరల మరల పంచత్వమును ప్రదర్శత్వ మును పొందుచున్నారు.

గణపతిదేవ చక్రవర్తి సేనాధిపతియగు ఈ చౌండ సేనాని యొక్క మల్లెపూవుల వంటి తెల్లనైన విస్తార కీర్తుల చేత ఆకాశ నదీ ప్రవాహము స్వర్ణపూర్ణ కుంభాకారమును స్వీకరించు చున్నది. అనగా ఇతని కీర్తి స్వర్గపర్యంతము వెలిసినది.

---

1. వరంగల్ జిల్లా శాసనములు పుటలు - 131-137.

అత్యంత పరాక్రముడు, కీర్తింపబడిన అనంత భోగములు కలవాడు, సత్యగుణుడు, బ్రాహ్మణులకు హితము గూర్చుటయం దాసక్తి గలవాడు, భూమండలమును పాలించినవాడు, ప్రేమాస్పదుడు, ధైర్యశాలి యగు చౌండసేనాని వద్ద లక్ష్మీదేవి (అనగా సంపద) చిరకాలము ప్రీతితో కాపురము చేసెను.

యాచకులకు కోరిన సంపదలను దానము చేయు స్వచ్ఛ గుణయుక్తుడగు చౌండసేనాని నొక్కని సృష్టించి బ్రహ్మదేవుడు కేవల స్వర్గభోగ్యములైన కల్పతరువు, కామధేనువు, చింతామణుల సృష్టికారణముగా పొందిన జనాపవాదమును తొలగించుకొనెను.

అనగా స్వర్గమున కల్పవృక్షాదులవలె భూమిపై చౌండసేనానిని వితరణశీలిగా బ్రహ్మ నిర్మించినాడు.

"ప్రఖ్యాత చౌండపురనామ్ని మహాగ్రహారే దత్తే స్వయం ప్రవర విప్రకదంబకాయ।స్ఫీతం తడాగ మహ చౌండ సముద్ర సౌంజ్ఞిం యస్తంవ్యదత్త విధూతాంబుధివర్గ గర్వం॥ యః ప్రోత్తుంగ తరంగ సంగతి భవడ్డిండీర పిండచ్ఛ లాత్తీరేతార తరేందు మండల మయీం మాలాం సదోత్పాదయన్। భ్రామ్యన్మందర మంథమంథన వశాదేకేందు సంభూతిజాం క్షీరాబ్ధేరధరీకరోతి పరితః కీర్తిం జగద్వ్యాపినీం। యస్యా స్త్రేయసీ కాంతా మైలమాఖ్యా మనోరమా। యయారూప గుణైస్సర్వా నిర్జితాన్నిర్జ రాంగనాః। గంగా వక్రగతి ద్విమార్గంట గమనా సారుంధతీ సర్వదాభూరేషా చ భుజంగ భోగనిరతా సీతా కుజన్మాతథా। పాంచాలీ మహావల్లభా ప్రనితా జాతా జడాదిందిరా నిర్దోషా గుణినీ చ యస్య గిహిణీ తసూపమేయాకయా॥ గణపతి నరపాలః శ్రీపదారాధకస్య ప్రథిత గుణగరిష్ఠః సంకిసాధీశ్వరస్య, మతిరజని విధాతుం తస్యశంభోః ప్రతిష్ఠాం॥"

ప్రఖ్యాతమైన చౌండపురమను మహాగ్రహారమును విప్రసమూహమునకు ఈతడు దాన మీయగా ఆ దాన జలధారతో చౌండ సముద్రమను పేరుగల ఒక తటాక మేర్పడినదో అది అంత వరకు గల సముద్రముల గర్వమును అణచినది.

ఈ చౌండసేనాని చౌండ సముద్రమున ఎత్తైన తరగల చలనము చేత కలిగిన నురుగుల యొక్క ముద్దలచే చంద్రమండలములనే ఉత్పత్తి చేయుచు, మందర పర్వత సాధనమున కేవలము ఒక చంద్రునినే సృజింపగలిగినందువలన యేర్పడిన పాలసముద్రముయొక్క విశ్వవ్యాప్తమైన కీర్తిని అణగద్రొక్కుచున్నాడు - అని చౌండసేనాని కీర్తి వర్ణింపబడినది.

మనస్సును రమింపజేయు మైలమ అను మహిళారత్నము చౌండసేనాని భార్య. ఈ మైలమాంబ దేవతా స్త్రీలను కూడ మించిన రూపగుణ సౌందర్యము కలది.

గంగాదేవి వక్రముగా సంచరించును అరుంధతి విమార్గమున అనగా విహార మార్గము ఆకాశ మార్గమున పోవునది. ఇక భూదేవి ఎల్లప్పుడు సర్పరాజుతో సౌఖ్యానుభూతి నొందునది. అనగా భూమి ఆదిశేషుని పడగలపై ఉండునది. సీతాదేవి కుజన్మ కలది. కు నేల, లేక భూమి వలన జన్మించినది. అనగా భూజాత. ద్రౌపది బహుభర్తలు కలది. లక్ష్మీదేవి జడజాత అనగా జలము నుండి పుట్టినది లేక జడుడైన సముద్రుని నుండి జన్మించినది. ఈవిధముగా పై పతివ్రత లందరు దోషములతో గూడినవారు. కాని దోషరహిత గుణవంతురాలును నైన మైలమను ఎవరితో పోల్చదగును అనగా ఆమె సాటిలేని గుణవతి యని భావము.

చౌండసేనాని విమల గుణగరిష్ఠుడు. లక్ష్మీపాద సేవకుడు. గణపతిచమూపతి సేనాపతి అని వర్ణింపబడినాడు.

రత్నానామపి చాకరత్వమతియః ప్రిథ్వీశ కోశావృతైరత్నైః పూర్ణ్యా సుముష్య కోశ భవనం మల్యాల నాథోప్యదాత్॥ తతో గణపతి క్షోణీపతిన్నా మవ్యధాత్సుధీః। ద్వీపిలుంటాక ఇత్యేవం ఖ్యాతం చౌండ చమూపతేః॥

వివిధ రాజులను గెలిచి వారి కోశాగారముల నుండి సమకూర్చిన రత్నముల చేత తన కోశాగారమును పూరించిన ఈ మల్యాల నాథుడైన చౌండసేనాని రత్నాకరత్వ పదమును పొందెను. ద్వీపిలుంఠక అను బిరుదమును పొందినవాడుగా ప్రసిద్ధి గాంచెను. చౌండసేనాని మైలమ దంపతు లిరువురు శైవభక్తి గలవారు. విప్రులకు భూ సువర్ణాది దానముల నొసంగినవారు.

చౌండసేనాని ఓరుగల్లు నగర ప్రాంతమందున్న కొండిపర్తిలో నివసించుచుండెను. అచట కాకతి సైన్య ముండెడిది. ఓరంగల్లు దుర్గ సంరక్షణార్థ మీ సైన్యము కొండిపర్తిలో నిలువ బడినది.

ఈ కాకతి సైన్యమున కధ్యక్షుడు చౌండసేనాని. కొండిపర్తిలో చౌండసేనాని చౌండేశ్వ రాలయమును నిర్మించెను. ఈ ఆలయమున పూజాదికములు నిర్వహింపబడుటకు దాన ధర్మము లొసంగబడినవి.

చౌండసేనాని తల్లి కాచాంబిక, తండ్రి కాట చమూపతి. అతడు కొండిపర్తిలో నొక త్రికూట దేవాలయమును నిర్మించెను.



శివాలయము – సంకీస



శివలింగము – సంకీస



రామాలయ సింహ ద్వారము – సంకీస



కల్యాణ మంటపము – సంకీస

చౌండ సేనాని గొప్ప వీరుడు. యుద్ధ విశారదుడు. ఆహవ రంగమునం దతని నెదిరించిన అరి వీరులు నిమిషమైనను అతని ముందు నిలువజాలకుండిరి.

చౌండ సేనాని వేయించిన కొండిపర్తి శాసనమున మైలమ గుణగణములు వర్ణింపబడినవి.

## బాచ సేనాని :

మల్యాల దన్న సేనాని రెండవ కుమారుడు బాచవరూధినీశుడు. ఇతని తనయుడు గుండ దండాధీశుడు. దన్న సేనాని కాకతి ప్రోలరాజు నుండి సంకీసపుర రాజ్యమును పొంది, జ్యేష్ట కుమారుడగు సబ్బ సేనాని కప్పగించెను.

సబ్బ సేనాని సంతతి వారు సంకీసపుర సామంత రాజ్యమును పాలించిరి. దన్న సేనాని తన రెండవ కుమారుడగు బాచవరూధినీశునికి బూదపుర రాజ్యము నేలుటకు నియమింపజేసెను. ఈ రెండు సామంత రాజ్యములను మల్యాల వంశీయులు పాలించిరి.

మల్యాల గుండ దండాధీశుని శక వర్షము 1181 = క్రి.శ. 1259 నాటి బూదపూరు శాసనమున[1] బాచ సేనాని "తస్మాద భ్రాత్ప భూతారి గర్వో దర్వీకరౌజసః గారుత్మత మీవాం బోధేరత్నం బాచ చమూపతిః మారస్యేవ రతి స్తస్య జాయా బాచాంబికాయధా శృంగార రస సారేణ రచితేవ విరించినా॥"

దన్న సేనానికి పుత్రుడుగా జన్మించిన బాచ సేనాని శత్రువుల గర్వమనే సర్వమును అణచు గరుత్మంతుని వంటివాడు. మల్యాల వంశాంబుధిలో జన్మించిన రత్నము. మన్మథునకు రతీదేవి వలె ఈ బాచ సేనానికి బాచాంబిక భార్యగా నయ్యెను. బ్రహ్మదేవు డీమెను శృంగార రస సారము చేత నిర్మించినాడా యనున ట్లతిలోక సౌందర్యవతిగా వెలుగొందెను.

మల్యాల గుండ సేనాని శక సంవత్సరము 1194 = క్రి. శ. 1272 నాటి బూదపుర శాసనమున[2] "తస్మాద భూదతుల భావిత పుణ్యమూర్తిః శ్రీ బాచ సైనిక పతిః ప్రథిత ప్రభావః ఉద్దామరాయ గరుడధ్వజ వీరలక్ష్మి లక్ష్మక్షమాతల సురక్ష బాచ సేనాని నిత్యదక్షః" అనియు వర్ణింపబడినాడు.

1. మహబూబునగర జిల్లా శాసనములు నెం. 84 పుటలు 334-340.
2. మహబూబునగర జిల్లా సర్వస్వము నెం. 85 పుటలు 341-348

బాచవరూధినీశుడు దన్న సేనాని తనయుడు. ఇతనికి పెదముత్తుగండ బిరుదమున్నది. బాచ సేనాని ధర్మపత్ని బాచాంబ ఈ దంపతుల కుమారుడు గుండదండాధీశుడు. గణపతిదేవ చక్రవర్తిచే వర్ధమానపుర ప్రాంత పాలకుడుగ నియమింపబడినవాడు.

## గుండదండాధీశుడు :

మల్యాల దన్న సేనాని పౌత్రుడును, బాచాంబ బాచవరూధినీశుల తనయుడును నగు గుండ దండాధీశుడు, కాకతి గణపతిదేవ చక్రవర్తి, రుద్రమహాదేవుల సామంతునిగను, దండ నాయకునిగను నుండినవాడు.

బూదపూరు, వర్ధమానపుర ప్రాంతములపై ఆధిపత్యము వహించినవాడు - కృష్ణానది ఉత్తర ప్రాంతముల నేలుచు కాకతి శత్రువులను నిర్జించినవాడు-బాచ సేనాని పుత్రుడుగా జన్మించిన గుండ దండాధీశుడు అసమానుడు, పుణ్యమూర్తి. ప్రసిద్ధుడు, వీరలక్ష్మీయుతుడు, భూతలమును సురక్షితముగ కాపాడినవాడు.

మల్యాల గుండన తాను వేయించిన వర్ధమానపుర శాసనమున[1] తత్పాద ప్రసాదాసాదిత, రాజ్యలక్ష్మి నివాసుండును, వినుత విలాసుండును, సంకీస పురాధినాధ, తిమిర మార్తాండుండును, బెడ ముట్టు గండండును, వీర వితరణ గుణగణాలంకారుడును, సుచరిత వ్రతాచారుండును, బాచాంబికోదర క్షీరపారావార సంజాత హరిచందనుండును, బాచవరూధినీశ వర నందనుండును నసి, మునల, కణయ, కంపణ ముద్గర, తోమర, ముషుండి భిండివాల, చక్ర, క్రకచ,నారాచ,కార్ముక కాద్య నేకాయుధ ప్రవీణుండును, ననవరత పరమ కల్యాణుండును, దుష్టతురగరేఖారేవంతుండును, వారనారీయౌవన వసంతుండును, వీణా, వేణు తాళ, కాహళ,తుణవ,పణవ,పటహ, మృదంగాద్యనేక విద్యా కుశలుండును, వివిధ కీర్తి విశాలుండును, గుప్పాంబా మానస సరోవర విహారమాణ రాజహంసుండును, నిజకులోత్తముండును, సముత్పాదిత దీనానాథ చిత్త వికాసుండును, నిమ్మళాల నిఖిల ధమ్మాళవాసుండును, శ్రీ విశ్వనాథ దేవ దివ్య శ్రీ పాద పద్మారాధకుండును, రిపుకుల భేదకుండును నైన శ్రీ మన్మల్యాల గుండ దండాధీశ్వరుండు మంత్రి పురోహిత సేనాపతి దౌవారిక మహా ప్రధానానంత సామంత సుభట, విట, విదూషక, పారక, పీఠమర్దక, నట, నర్తక, రసిక, రంజక, కవి, గమికి,వాది,వాగ్మి, వంది, వైతాళిక, హావక, భావక, గాయకాద్యనేక విద్వజ్జనంబులు గొలువ సుఖోపవిష్టుండై ఇష్ట కథా వినోదంబుల నుండి అనియు, మరియొక బూదపుర శాసనము శక సంవత్సరము 1194 నాటి దానిలోను వర్ధమానపుర శాసనమందువలె ప్రశంసింప బడినాడు. అనేకులైన విప్రులకు భూమి దానమిచ్చు సందర్భమునందీ శాసనము వేయింపబడినది.

---

1. మహబూబునగర్ జిల్లా సర్వస్వము పుట. 1026-1033.

మల్యాల గుండన శక సంవత్సరము 1181= క్రీ శ. 1259 నాటి బూదపుర శాసనము వర్ధమానపుర శాసన ప్రశస్తిని కలిగియున్నది.

బూదపుర, వర్ధమానపుర శాసనములను ఈశ్వరార్యుని తనయుడగు మయూరసూరి రచించెను ఇతడు పద వాక్య ప్రమాణ ప్రమేయ విచిత్ర కవిత్వ తత్వజ్ఞుడు. అభినవ మయూర సూరి బిరుదాంచితుడు.

మల్యాల గుండ దండాధీశుడీ శాసనములందు "మన్మధుని వంటి వాడనియు, మదనుడు స్త్రీలను అస్త్రములుగ నుపయోగించును కాని గుండన మంత్రి అస్త్రములను ధరించిన వీరులను యుద్ధరంగమున స్త్రీలుగ జేయును" అని వర్ణింపబడినాడు.

మల్యాల వంశజులు పరాక్రమోపేతులు. వారు స్వామి భక్తి పరాయణులు. కాకతిరుద్ర దేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి పాలించు కాలమున కాకతి శత్రువులతో పోరాడి విజయములు సాధించి పెదముట్టుగండ, ద్వీపిలుంఠాక బిరుదములతో పాటు, రాయగరుడాంకమును బొందిరి.

గుండదండాధీశుడు సంగ్రామములకు బయలుదేరు సమయమున గరుడధ్వజమును కలిగి యుండెడి వాడు. ధ్వజోన్నతి గగనమండలమును తాకుటవలన సూర్య రథసారధి యగు అనూరుడు, తన సోదరుడగు గరుడునితో సంభాషించుచుండు ననియు, అందువలన సూర్య రథము సతడు మెల్లగా నడుపుచుండుట వలన పగటి వేళలు దీర్ఘములై యుండెననియు గుండసేనాని వర్ణింప బడినాడు.

గుండ దండాధీశుని కీర్తి పాతాళము వరకు విస్తరించెను. ఆదిశేషుడు దీనవదనుడై శిరస్సులను వంచుకొని యుండ గుండసేనాని శేషుడు తనపై చూపిన గౌరవాదరముల కాతడు వహించు భూభారమును తన భుజ స్కంధములపై మోపుకొనెను. ఇట్టి అపురూపమైన వర్ణనములతో వర్ధమాన, బూదపూరు శాసనములు వేయింపబడినవి.

## కుప్పాంబిక :

మల్యాల గుండ దండాధీశుని ధర్మపత్ని గోన వంశోత్పన్న యగు కుప్పాంబిక. సుప్రసిద్ధ కాకతి సేనాని గోన గన్నారెడ్డి సోదరి. కుప్పాంబిక వేయించిన శక సంవత్సరము 1198 నాటి బూదపూరు శాసనము[1] ననుసరించి గుండసేనాని క్రి. శ. 1276 నాటికే దివంగతుడైనట్లు తెలియుచున్నది.

---

1. మహబూబునగర జిల్లా సర్వస్వము నెం. 86 - 1049 - 1050

ఈ శాసనమును కుప్పాంబిక, మరణించిన తన భర్త పేర గుండేశ్వరాలయమును నిర్మించి, ఆలయ పూజాదికములకు భూదాన మిచ్చు సందర్భమున వేయించెను.

**శాసన విషయము :**

కాకతి రుద్రాంబ ఓరుగల్లు పట్టణమును రాజధానిగా పాలించుచున్న కాలమునందీయ బడిన ఈ శాసనమున.

"అనుమకొండ పురవరాధీశ్వర కాకతీయ రుద్రదేవ మహారాజులు ఓరుగంటను పృథ్వీ రాజ్యము సేయుచుండం గాను, మల్యాల గుండ దండాధీశుని ధర్మపత్ని కుప్పాంబిక భర్త మరణానంతరము బూదపురమున గుడి గట్టించి శక సంవత్సరము 1198 - క్రీ.శ. 1276 నాటి ధాత్రి సంవత్సర మాఘ శుద్ధ దశమి గురువారమున గుండయపేర లింగ ప్రతిష్ట చేసి కుప్ప సానమ్మ గారు తమ కొడుకులు బాచయ బొప్పందు, గణపతి దేవండు, పర్వతమల్లయ, తమ్ముడు గోన బుద్ధయ, విరయ కొడుకు గుండయ సహితమై గుండేశ్వర దేవరకు ధారా పూర్వకముగా వృత్తి సీరు నేల,

బాచ సముద్రాన మర్తులు 2

కుప్ప సముద్రాన మర్తు 1

గణప సముద్రాన మర్తు ½

బుధుని కుంటను 1½ మర్తు

వెరసి 5 మర్తులు, వెలివొలము బూదపురమున మర్తులు 12, పొశులమడుగున మర్తు 9 వెరసి 21 మర్తులు. ఇంతవర కాచంద్రార్కముగా చీల జియ్యల కొడుకు వైజ జీయలాను ఈ స్థానానుకు ఒడయలై బిడ్డ బిడ్డ తరము ప్రసాదోపజీవులై ఉండండని పంచి తద్ధర్మ సంరక్షణార్థంబై పద క్రమయుత యజుర్వేద పారణ, శబ్ద విశారద కవీశ్వరులైన ఈశ్వరభట్టోపాధ్యాయులను సాసనంబు చెప్పంబంచెను."

విరయ, బాచయ, బొప్ప కాశీ క్షేత్రమునకు బాచయ బొప్పని అవ్వ పుణ్యార్థము విరయ, కూనాయి నారాయనుని అవ్వ పేరమాడిని వారణాసికిం బుచ్చి బాచ సముద్రం వెనకం బెట్టిన వ్రిత్తి మ 2 వెరసి 2 మర్తురు అని శాసనాంతమున చెప్పబడినది.



ధ్వజస్తంభము – సంకీస



సంకీస – రథము

కుప్పాంబిక గోన బుద్ధారెడ్డి తనయ. సకల గుణగణముల కాలవాలమైన వనిత. ప్రపంచమున పతివ్రతగా కీర్తిగాంచిన కుప్పాంబిక అనేక వ్రతముల నాచరించినది. లక్ష్మీనారాయణ, జలశయన, అశూన్యశయ్య, అనంత అరుంధతీయ, ద్వాదశి తదితర వ్రతములు, కల్ప సూత్రముల ననుసరించి, నిర్వహించిన పుణ్యాత్మురాలు విదుషీమణి నూతులు, పశువులకు నీటి కుంటలు ఇతరములైన నీటి వసతు లేర్పరచిన గుణవంతురాలు. శివాలయములను ప్రతిష్టించుట, తోటలు వేయించుట, చెఱువులు త్రవ్వించుట, విష్ణు విగ్రహములు ప్రతిష్టించుట వంటి అనేక సత్కార్యము లాచరించిన కుప్పాంబిక ప్రజాదరమును పొందిన వనిత. అనేక పర్యాయములు మంచి వారికి, కులీనులకు, దీనాంధ కృపణులకు దాన ధర్మములు చేసిన వనితా శిరోమణి కుప్పాంబిక.

స్వర్ణము, రథములు, గుఱ్ఱములు, అన్నము, ఆవులు, గృహములు, బట్టలు, నీరు, గొడుగులు, పక్క బట్టలు, అనేకానేక వస్తువులు ధర్మము చేసిన కుప్పాంబిక గోన, మల్యాల వంశముల కీర్తి ప్రతిష్టల నినుమడింపజేసినది

## మల్యాల వంశీయుల శాసనములందు పేర్కొనబడిన స్త్రీలలో :

1) మైలమ, 2) ఆచమ, 3) బొల్లమ, 4) కాచమాంబ, 5) రుద్రమదేవి, 6) బాచ మాంబ, 7) బితమ, 8) కుప్పాంబిక ముఖ్యులు.

## ఈ వంశజులు వేయించిన శాసనములందు పేర్కొనబడిన ప్రభువులు, వారి సామంత మాండలికులు, అమాత్య, కవి పండితవర్యులలో :

1) గణపతిదేవ చక్రవర్తి, 2) ఈశ్వర భట్టోపాధ్యాయుడు, 3) అభినవ మయూరసూరి, 4) గోన బుద్ధారెడ్డి, 5) గోన గన్నయ, 6) చౌండ సేనాని, 7) కాటసేనాని, 8) సబ్బసేనాని, 9) దన్న సేనాని, 10) పోతసేనాని, 11) గుండదండాధీశుడు, 12) బాచవరూధినీశుడు, 13) గణపతిదేవండు, 14) పర్వతమల్లు, 15) సూర ప్రభువు, 16) సూరసేనాని తనయుడు ప్రోలసేనాని, 17) సూరసేనాని కుమారుడు మల్లసేనాని, 18) బేతరాజు, 19) బేతసేనాని,

20) బేతసేనాని తనయుడు మల్లసేనాని, 21) బేతసేనాని తనయుడు ప్రోలసేనాని, 22) కొమ్మ సేనాని, 23) కాకతి ప్రోలరాజు, 24) కాకతి రెండవ బేతరాజు, 25) అరెటి ప్రసాద, 26) వైజజియ్య, 27) సిద్ధజియ్య, 28) చీలజియ్య, 29) బాచజియ్య, 30) సూనాయి నారాయణ, 31) మహా దేవరాజు, 32) సోమనాథ భట్టోపాధ్యాయుడు, 33) పల్లెన భట్టోపాధ్యాయుడు, 34) దేవకూచి, 35) అక్కన ఘట శాసులు, 36) కేశవ ఘట శాసులు, 37) సోమయి పెద్ది, 38) ఆలేటి పోతమ ఘట శాసులు, 39) పురాణం పోద్దేవపెద్ది, 40) నారాయణ మంచెన, 41) పీరపెద్ది, 42) బొంతల విఠల పెద్ది, 43) తరణికంటి ఈశ్వర భట్టోపాధ్యాయుడు, 44) అనికూచింగారు, 45) భట్ట అప్పయ, 46) అన్న భట్టోపాధ్యాయుడు, 47) ఒద్దయ, 48) ఈశ్వరసూరి, 49) మయూరార్య, 50) పెద్ద నందగిరి శ్రీ పాదాల మల్లయ, 51) కూచన ప్రభృతులు ముఖ్యముగా నెన్నదగినవారు

**శాసనములందు పేర్కొనబడిన గ్రామ నామములు :**

1) మల్యాల, 2) హనుమకొండ, 3) ఓరుగల్లు, 4) సంకీస పురము, 5. వర్ధమాన పురము, 6) పినలట్టి, 7) బూదపురము, 8) చౌండపురము, 9) కటుకూరు, 10) కొండిపర్తి, 11) వారణాసి, 12) గయ, 13, పోతులమడుగు, 14) బొమ్మకంటి, 15) అలంపూరు, 16) నయికుడిక్కి.

—:●:—

## శాసనములందు పేర్కొనబడిన అగ్రహారములు - భూములు

| సం. | శాసనము | దాత పేరు | దానమిచ్చిన సందర్భము | శాసన కాలము | దాన వివరము | దానపరిగ్రహీత |
|---|---|---|---|---|---|---|
| 1. | కటుకూరు | మైలమ | మల్లికార్జున ఐతేశ్వర అన్నేశ్వరాలయముల నిర్మాణము | శక సంవత్సరము 1124 దుందుభి = క్రీ.శ. 1202 | భూమి దానము దేవరల అంగరంగ భోగములకు ధూపదీప నైవేద్యాదులకు | దేవాలయ నిర్వాహకులు |
| 2 | కొండిపర్తి | చౌండసేనాని | చౌండేశ్వరాలయ నిర్మాణము | శక సంవత్సరము 1125 రుధిరోద్గారి వైశాఖ శుద్ధ పంచమి = క్రీ.శ. 1203 | వఱుకుర్కి గ్రామము చౌండపురము | చౌండేశ్వరాలయమునకు, విప్రులకు |
| 3 | కొండిపర్తి | కాటసేనాని | రుద్రేశ్వర కేశవ స్వామి ఆలయముల నిర్మాణము ప్రోలేశ్వ రాలయమునకు దానము | శక సంవత్సరము 1162 శార్వరి ఫాల్గుణ శుద్ధ ఏకాదశి శనివారము = క్రీ. శ 1240 - 1241 | రుద్రేశ్వరమునకు 3 నివర్తనముల భూమి కేశవదేవరకు 2 నివర్తనములు ప్రోలేశ్వరదేవరకు 2 నివర్తనములు త్రికూటేశ్వ రాలయమునకు బొల్లమ చెరువు క్రింద సీరు నేల వెలివొలము 30 నివర్తనములు దేవరల అంగరంగ భోగముల నిమిత్తము | రుద్రేశ్వర కేశవదేవర ప్రోలేశ్వర దేవాలయముల పూజాదికములకు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 4. | వర్ధమానపురము | మల్యాల గుండ దండాధీశుడు | ప్రాకార గోపురములతో గూడిన నాగేశ్వరాలయ నిర్మాణము. | శక సంవత్సరము 1167 విశ్వావసు పుష్య బహుళ అమావాస్య సూర్య గ్రహణ కాలము క్రీ.శ. 1245-1246. | పినలట్టి గ్రామము అగ్రహారమును సర్వ సమస్యముగా చేసి యిచ్చుట. | నాగేశ్వరాలయ ధూప దీప నైవేద్యములకు అంగరంగ భోగములకు పూజాదికములకు. |
| 5. | బూదపూరు | గుండసేనాని | బూదపుర సమీపమున గుండ మంత్రి తన తల్లిపేర బాచ సముద్రమున లేక బాస్సముద్రమను తటాక నిర్మాణము | శక సంవత్సరము 1181 సిద్ధార్థి చైత్ర శుద్ధ త్రయోదశి గురువారము = క్రీ.శ. 1259-60 | 11 మఱ్ఱురుల భూమి కుప్ప సముద్రము వెనుక 10 మఱ్ఱురుల వెలి పొలము | ఈశ్వర భట్టోపాధ్యాయులు |
| | | | | | మఱ్ఱురు భూమి ప్రోలిరెడ్డి కాలువక్రింద | వెన్నభట్టోపాధ్యాయులు |
| | | | | | మఱ్ఱురు రడ్డికుంట క్రింద | ఆలేటిమంచిగారు |
| | | | | | మఱ్ఱురు రడ్డికుంట క్రింద | అనికూంచిగారు |
| | | | | | మఱ్ఱురుంబాదిక రడ్డికుంట క్రింద | కొమరస్వామిమంచి |
| | | | | | కుప్పసముద్రము క్రింద అర్ధముఱ్ఱు రడ్డి కుంట వెనుక మఱ్ఱుఱులు | గుండేశ్వర, కుప్పేశ్వర దేవరలకు, పెద్దనందగిరి శ్రీపాదాల మల్లియకు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | | మఱితురు పాతిక కాలువ క్రింద మఱ్తురు అడ్డ. | గూచెనకు భట్టి భట్టి అప్పయం గారికి. |
| | | | | | బుధుని కుంట వెనుక మఱితురు గల చెఱువు వెనుక అడ్డ. | కూడలి సంగమేశ్వర దేవరకు. |
| 6. | బూదపురము | గుండసేనాని | గణపసముద్ర నిర్మాణము | శక సంవత్సరము 1194 అంగిరస శ్రావణ శుద్ధ 15 చంద్రగ్రహణ కాలము = క్రి. శ. 1272-1273 | 4 మఱితులు 1 అడ్డ | భరద్వాజ గోత్ర సోమనాథ వల్లెన భట్టోపాధ్యాయులు |
| | | | | | 1 అడ్డ | సోమనాథ భట్టోపాధ్యాయుడు |
| | | | | | 2 మఱ్తుల్లు | హారీతి గోత్రుడు బొమ్మకంటి విప్రుడు |
| | | | | | మర్తురుంబావు | చాతుర్మస్య వ్రతము నకై ఆసూరదేవ కూచికి |
| | | | | | మర్తురుంబావు | గౌతమ గోత్ర విప్రులు |
| | | | | | మఱ్తుఱు భూమి | భారద్వాజ గోత్రులు అక్కినయిలు శాసులు కౌరవ ఘట శాసులు |

| | |
|---|---|
| మర్తురు | కాలుకాయన విశ్వామిత్ర గోత్రజుడగు సోమయపెద్ది |
| $\frac{3}{4}$ మర్తురు | శ్రీపర్వత ప్రదక్షిణార్థము శ్రీవత్స గోత్రుడగు ఆలేటి పోతమ ఘటశాసులు |
| ఒక మర్తురు భూమి | అలంపూరుతో తుంగభద్రానదీ స్నానము చేయు భక్తులకు మంత్రము చెప్పుటకు భారద్వాజ గోత్రజుడగు పురాణం ప్రోలదేవ పెద్దికి |
| $\frac{1}{4}$ మర్తురు | తరణికుంట ఈశ్వర భట్టోపాధ్యాయుడు |
| ఒక మర్తురు | కౌండిన్య గోత్రము నారాయణమంచెటి |
| ఒక మర్తురు | కాలుకాయన విశ్వామిత్ర గోత్రజుడగు పేరి పెద్ది |
| ఒక అర్థ. | కౌండిన్యస గోత్ర బొంతల విరల పెద్ది |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 7. | బూదపూరు | కుప్పాంబిక | గుండేశ్వరాలయ నిర్మాణము. | శక సంవత్సరము 1196 ధాత్రి మాఘ శుద్ధ దశమి గురువారము క్రీ.శ. 1274-1275. | బావులు, కుంటలు. తటాకములు, తోటలు, చెరువుల నిర్మాణము. | |
| | | | | | విష్ణు విగ్రహ, శివలింగ ప్రతిష్ఠలు. | బీదలు అర్తులు |
| | | | | | భూములు, బంగారము, ఇండ్లు. | దేవాలయములు. |
| | | | | | బాచ సముద్రము వెనుక 2 మఱ్ఱుర్లు. | కూనాయ నాయకుడు. |
| | | | | | బాస్సముద్రము క్రింద 2 మఱ్ఱురులు కుప్పసముద్రము క్రింద 1 మఱ్ఱురు 1½ మఱ్ఱురు బుధుని కుంట, | గుండేశ్వర దేవర పూజాదికములకు |
| | | | | | ½ మఱ్ఱు గణప సముద్రము క్రింద, నీరు నేల మొత్తము 5 మర్తుర్లు వెలివొలము 9 మఱ్ఱుర్లు | చీల జియ్యకొడుకు జైన జియ్యలు |



గరుడవాహనము – సంకీస



అశ్వవాహనము – సంకీస

**పరిపాలనా విధానము :**

మల్యాల వంశమున దన్న సేనాని మొదటివాడు. అతని జ్యేష్ఠ కుమారుడు సబ్బ సేనాని. సబ్బ సేనాని తనయుడు కాటయ అమాత్యుడు - కాకతి రుద్రదేవుని మంత్రిగా పనిచేసిన మేధావి అతనికి పోతసేనాని, చౌండసేనానులనువారు తనయులు.

దన్న సేనాని రెండవ కుమారుడు బాచవరూధినీశుడు అతడు బూదపుర రాజ్య పాలకుడు. అతని యనంతర మాతని కుమారుడు గుండదండాధీశుడు వర్ధమానపుర, బూదపుర రాజ్యములను పాలించెను.

సంకీసపుర రాజ్యమున సంకీసపురము, మల్యాల, కొండిపర్తి, కటుకూరు తదితర ప్రాంతములు చేరి యుండెను. వర్ధమానపుర రాజ్యము కందూరునాడులోనిది అందు వర్ధమాన పురము, బూదపురము, కందూరు, తదితర ప్రదేశములుండెను.

మల్యాల వంశజుల సామంతరాజ్యములందనేక దుర్గములుండెను. ఆ దుర్గములను దుర్గాధ్యక్షులు పాలించుచుండిరి. దుర్గముల సంరక్షణార్థము తగిన సైన్య మాయాప్రదేశములందు నియమింపబడియుండెను.

మల్యాల వంశీయులు ఓరుగల్లు నగర సంరక్షణాబాధ్యత వహించి కొండిపర్తిలో నున్న కాకతి సైన్యమున కాధిపత్యము వహించియుండిరి.

దుర్గ సంరక్షణార్థము నియుక్తులైన అధిపతులు మల్యాల వంశజుల కాప్తవర్గములోని వారై యుండిరి. మరికొందరు విరియాల వంశమునకు చెందిన రాజుల విధేయులుండిరి. దుర్గాధిపతులు, సేనానులు మల్యాల దండనాధుల కనుసన్నలలో మెలగుచు అవసర సమయములందు తమ సైనిక బలముతో కాకతి రాజులకు సహాయపడుచుండిరి.

కాకతి రాజన్యులపైగల అభిమానము వలన మల్యాల, విరియాల వంశజులు తమ సంతతికి తమ ప్రభువుల పేర్ల పెట్టుకొనుచుండిరి.

కాకతి రాజులవలె మల్యాల సామంత రాజ్య పాలకులకు భూమిపై అధి కాదాయము లభించుచుండెను. సామంత రాజ్యములందలి విభాగములందు సుంకాధికారులు భూమి శిస్తులతోపాటు తదితర పన్నులను వసూలుచేయు బాధ్యత వహించి యుండిరి. పరిపాలనా సౌలభ్యమునకు సంకీస

వర్ధమానపుర రాజ్యములు కొన్ని భూమ్యాదాయ విభాగములుగ చేయబడినవి. ఆయా ప్రాంతముల అభివృద్ధికి ప్రభుత్వాధికారులు, తోడ్పడుచుండిరి.

## విద్యా వైదుష్యములు :

మల్యాల వంశీయులు సాహిత్యాభిమానులు. వారు ప్రకటించిన శాసన రచయితలు గొప్ప పండితులు. వ్యాకరణ శాస్త్రజ్ఞులు. అపార పాండిత్యముతోపాటు అనర్గళ కవితాధార కలవారు. మేధావులు. మాన్యులు. వేద వేదాంతేతిహాస పురాణములను క్షుణ్ణముగ నభ్యసించినవారు. కటుకూరు, కొండిపర్తి, వర్ధమానపురము, బూదపురములందు మల్యాల వంశీయులు వేయించిన శాసనములు సంస్కృత భాషలోను, సంస్కృతాంధ్ర భాషలలోను నున్నవి. సంస్కృత శ్లోకములలో కూడిన ఈ శాసనములు లఘుకావ్యములవలె కనిపించును.

ఆనాడు వేదశాస్త్రములు శాఖోపశాఖలుగ విభజింపబడి వ్యాప్తి చెందినవి. ఋగ్వేదశాఖలు 21, యజుర్వేదమునకు చెందిన 101 శాఖలు, సామవేదమున 1000, అధర్వవేదమున 9 శాఖ లుండినట్లు మహా భాష్యమువలన తెలియుచున్నది. ప్రతి వేదము సంహితము, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు అను భాగములుగ నుండినది. గురుశిష్య పరంపరగా నివి నిలిచియుండినవి.

వేదభాగములలో శిక్ష, ఛందస్సు, జ్యోతిషము, వ్యాకరణము నిరుక్తము, కల్పము లనునవి ముఖ్యమైనవి. ఇవి వేదాంగము లనబడినవి.

కాకతి సామ్రాజ్యము వర్ధిల్లిన కాలమున ఆ వంశ ప్రభువులు వారి సామంత మాండలికులు, మహా సామంతాధిపతులు, దండనాధులు అనేకమంది కవి పండితులను, వేదాధ్యయన సంపన్నులను, మహా పండితులను ఆదరించి, గౌరవించి, పోషించినారు.

అందు సంస్కృతాంధ్ర భాషలయందేగాక ఋగ్యజుస్సామధర్వ వేదములందు నిష్ణాతులైన మహామహులుండిరి. వర్ధమానపుర శాసనరచయిత, బూదపుర శాసనములను రచించిన కవి ఒకే వంశమునకు చెందినవారు. తండ్రి, కొడుకులు. అందు అభినవ మయూరసూరి ఈశ్వరార్యుని తనయుడు-వర్ధమానపుర శాసన కవి. బూదపుర శాసనములను రచించిన ఈశ్వరభట్టోపాధ్యాయుడు అభినవ మయూరసూరి తనయుడు. తండ్రిపేరు కుమారునికి పెట్టు సంప్రదాయ మాంధ్రావనిలో అనాదినుండి అమలులో నున్నది. ఈ యిద్దరు మహా కవులనుగూర్చి సంక్షిప్తముగా నిచట వ్రాయ బడుచున్నది.

## అభినవ మయూరసూరి :

మహా కవిగను పదవాక్య ప్రమాణప్రమేయ విచిత్ర కవిత్వ తత్వజ్ఞుడుగను అభివర్ణింప బడిన అభినవ మయూరసూరి ఆత్రేయ గోత్రోద్భవుడు. ఈశ్వరార్యుని తనయుడు.

మల్యాల గుండ దండాధీశుడు శక సంవత్సరము 1167 విశ్వావసు పుష్యమాస అమావాస్య సూర్యగ్రహణ కాలమున నాగేశ్వరాలయమును గోపుర ప్రాకారయుక్తముగ నిర్మించి స్వామి పూజాదికములకు ధూపదీప నైవేద్యములకు, అంగరంగ భోగములకు పిన్నలట్టిపల్లి గ్రామము నగ్రహారముగ నిచ్చు సందర్భమున తన ఆస్థానియగు అభినవ మయూరసూరిని శాసనము చెప్పమని ఆజ్ఞాపించెను.

వర్ధమానపుర శాసన మొక చిన్న రసవత్కావ్యము వలె నున్నది. ఇందు మల్యాల గుండన సాహసౌదార్య భక్తి ప్రపత్తులు, యుద్ధ విశారదత్వము రమ్యాతిరమ్యముగ వర్ణింపబడినవి.

మయూరసూరి అపార శబ్ద పరిజ్ఞానమున్నవాడు. అనర్గళ కవితాధార కలవాడు. సంస్కృతాంధ్ర భాషలపై అధికారమున్నవాడు. మృదుమధుర పదజాలముతో చక్కని శైలిలో రచనలు చేయు శక్తిమంతుడు.

అభినవ మయూరసూరి భక్తి, శృంగార, వీర, అద్భుతాది రసములను పోషించునట్టి కవితా శక్తి, పాండిత్యమున్న వాడని వర్ధమానపుర శాసనమును పరిశీలించిన అవగతము కాగలదు.

అభినవ మయూరసూరి రచించిన వర్ధమానపుర శాసనాంతమున చక్రబంధమను శ్లోక మున్నది. అందు రెండవ వలయమున నాగేశ శాసనము, నాల్గవ వలయమున మయూరసూరి కవి విరచితము, ఏడవ వలయమున గుండన మంత్రి వీరనుతి, తొమ్మిదవ వలయమున నాగయ లిఖిత మను లేఖకుని పేరు కూర్చబడినవి.

కావ్యము, కవి, కథానాయకుడు, లేఖకుడు ఈ చక్ర బంధమునం దిమిడినవి. ఈ చక్ర బంధము అభినవ మయురసూరి బంధ కవితా రచనా చాతుర్యమునకు నిదర్శనము.

## ఈశ్వరభట్టోపాధ్యాయుడు :

వర్ధమానపుర శాసన రచయిత అభినవ మయూరసూరి తనయుడు ఈశ్వరభట్టోపా ధ్యాయుడు. ఇతడు తండ్రి మరణానంతరము గుండదండాధీశుని ఆస్థాన కవిగా నియమింపబడి యుండును.

మల్యాల గుండసేనాని వేయించిన శక సంవత్సరములు 1181 మరియు 1194 నాటి శాసనములు బూదపూరులో నున్నవి. ఇవి ఈశ్వర భట్టోపాధ్యాయుడు రచించినవి. మల్యాల గుండసేనాని మరణించిన పిదప అతని భార్య కుప్పాంబిక గుండేశ్వరాలయ నిర్మాణము గావించి నపుడు ఈశ్వరభట్టోపాధ్యాయుని శాసనమును రచింపుమని కోరెను ఆ శాసనమును కూడ నితడు రచించెను.

మల్యాల గుండనమంత్రి బూదపూరులో వేయించిన రెండు శాసనములలో నొకదానియం దతడు రెండు తటాకములను నిర్మించినట్లున్నది. ఆ తటాకములలో నొకటి అతని తల్లి బాచమాంబ పేర బాస్సాని చెరువుగను, రెండవది తన భార్య కుప్పాంబిక పేర కుప్ప సముద్రముగను వ్యవహరింపబడునట్లు శాసనమున చెప్పబడినది.

ఈశ్వరభట్టోపాధ్యాయుడు రచించిన ఈ శాసనములు కావ్యరీతిలో నున్నవి

రెండవ బూదపూరు శాసనమును గుండన దండనాయకుడు తన యేలిక గణపతిదేవ చక్రవర్తి పేర గణప సముద్రమును నిర్మించి చంద్రగ్రహణకాలమున గుణశీల విద్యా తపస్సంపద గల బ్రాహ్మణుల కాతటాకము క్రింద భూములను దానమిచ్చు సందర్భమున వేయించెను.

ఈశ్వరభట్టోపాధ్యాయుడు గొప్పకవి. రచయిత. సంస్కృత సాహిత్యార్ణవమును మధించినవాడు. ఈ శాసనములందు నిర్దంత్యము, ఆర్యాగుచ్ఛము, పునరక్తాభాసము, కంఠ్యములు, తాలవ్యములు లేకుండుట, క్రియాపద ప్రాయికము, క్రియాపద త్రయ గోపకము, నిరోష్ఠ్యము, అక్షరముష్టిక, ద్రుతము లేకుండుట, మిధునావళి వంటి చిత్రకవితలున్నవి. తన తండ్రి అభినవ మయూరసూరివలె ఈశ్వరభట్టోపాధ్యాయుడు గూడ గొప్పకవి, పండితుడు.

ఈశ్వర భట్టోపాధ్యాయుడు మల్యాల గుండన మంత్రి మరణానంతర మాతని భార్య కుప్పసానమ్మ వేయించిన శక సంవత్సరము 1198 = క్రీ.శ. 1276 నాటి బూదపుర శాసనమును రచించెను. ఇది సంస్కృతాంధ్ర భాషలలో వేయింపబడినది. ఈశ్వరభట్టోపాధ్యాయుడీ శాసనమున పదక్రమయుత యజుర్వేద పారగుడనియు శబ్ద విద్యావిశారద కవీశ్వరుడనియు వర్ణింపబడినాడు. ఇతనికి గుండనమంత్రి, అతని భార్య కుప్పసానమ్మ భూములను దానముగా నొసంగిరి.

కటుకూరు, కొండిపర్తి శాసనములను రచించిన కవులు సంస్కృత భాషలో నిష్ణాతులు. వారు కవితా రచనలో అసాధ్యులు.



త్రికూటేశ్వరాలయము - కొండిపర్తి



నాగ ప్రతిమలు - సంకీస

## సంస్కృత కవితా వైభవము :

చౌండ సేనాని కొండిపర్తిలో నివసించుచుండెను. ఓరుగల్లు నగర సమీపమందీ కొండిపర్తి గ్రామమున్నది. ఇచటి నగర సంరక్షణార్థము కాకతి సైన్యము నిలుపబడినది ఈ సైన్యమున కధ్యక్షుడు చౌండ సేనాని.

కొండిపర్తి శాసనములను రచించిన కవుల పేర్లు పేర్కొనబడలేదు. కాని శాసనము లందలి వర్ణన లతి రమ్యముగ నున్నవి.

మల్యాలనాథ విమలాన్వయ సంభవస్య
యస్యారయో గతభియో నిమిషం పురస్థాః
చిత్రంభవన్తి సమరేఽధికలాభభాజో
యత్పంచతాం త్రిదశతా మపియన్తి భూయః॥

చౌండసేనాని యుద్ధరంగమున నిలచినపు డతని యెదుట నిమిషమైనను ధైర్యముతో శత్రువులు నిలువజాలకుండిరి. వారు మృతిని, వెనువెంటనే దేవత్వమును పొందుచుండిరి. ఇది స్తుతి రూప నిందా వ్యాజోక్తిగా భావింపవచ్చును.

కొండిపర్తి శాసనమందే చౌండసేనాని భార్య విరియాల వంశోత్పన్నయగు మైలమ-

గంగావక్రగతి ర్వ్యోమార్గ గమనా సారుంధతీ సర్వదా
భూరేషాచ భుజంగ భోగనిరతా సీతా కుజన్మాతథా।
పాంచాలీ బహువల్లభా ప్రవిదితా జాతా జడా దిందిరా
నిర్దోషా గుణినీచయస్య గృహిణీతా నూపమేయాకయా॥

పవిత్రమని భావించు గంగానది వక్రగతి కలది. అరుంధతి మహా పతివ్రత ఐనను ఆమె ఆకాశగమన. భూమి ఓర్పుగలదైనను శేషుని ఫణములపై నుండును. సీత భూమిలో జనన మొందెను. ద్రౌపది పంచభర్తృక.లక్ష్మీదేవి జడమైన సముద్రమున పుట్టినట్టిది. ఇట్టి మహా పతివ్రత లందరికి నేదేని యొక దోషమున్నది. కాని మైలమ కెట్టి దోషమును లేదు. సర్వ గుణసంపన్నురాలైన మైలమను వారిలో నెవ్వరితో పోల్చుటకు వీలులేదు.

మైలమ గొప్ప అందము కలది. ఆమె ప్రకటించిన కటుకూరు శాసనమున-

మంద సుందరగతం సుభాషితం
లోచనాంచల విలోల వీక్షితం
హంస కోకిం మృగైః పృథక్కృతం
యత్రయోగ మగమత్పరస్వరం.

అనగా సుందరమైన మందగమనము హంసలలో, మంచి కంఠస్వరము కోకిలలందును, ఆడ. లేళ్ళలో లోచనాంత విలోల దృష్టి యుండును. స్త్రీలలో నుండు ఈ మూడు లక్షణము లొకే వ్యక్తిలో గాంచుట దుర్లభము అట్టి త్రిగుణములున్న మైలమ శోభాతిశయముతో వెలుగుచున్నది.

కొండిపర్తి శాసనమున కాటసేనాని నిర్మించిన దేవాలయమును వర్ణించునపుడు-

ప్రాకారో జయతి త్రికూట మభి తస్థస్తేన నిర్మాపితః
సుశ్లిష్టైః క్రమశీర్షకై రుపచితో నీలోపల్లైః కల్పితః।
యశ్చా లక్షిత సంధి బంధ కధనా దేకాశిలా తక్షకైః
సంతక్ష్యేన మహీయసీమివ శిలాం యత్నాత్స ముత్తారితః॥

దేవాలయ వాస్తు విశేషమును ప్రస్తుతించు శ్లోకమిది. నల్లసరపు రాళ్ళను నునుపుగ జేసి స్తంభములను దూలములను ప్రాకారమును నిర్మించిన శిల్పుల ప్రతిభ అపూర్వము. దేవాలయ కుడ్యములందు రాళ్ళు ఒకదానిపై నొకటి పేర్చినట్లు కనిపింపక ఒకే శిలను కుడ్య రూపమున ఆలయ రూపమున తొలచినట్లు కనిపింపజేయుట ఆనాటి శిల్పుల అసాధారణ మేధా సంపత్తికి, శిల్పచాతుర్యమునకు అబ్బురపడవలసివచ్చును.

అట్లే గుండదండాధీశుని వర్ధమానపుర శాసనమును రచించిన అభినవ మయూరసూరి రచన అర్థ గాంభీర్యముతోను పద లాలిత్యముతోను రమ్యమైన వర్ణనలతోను కూడియుండును.

సముద్ధరతి నిర్వైరం తస్మిన్విశ్వంభరామిమాం
సహస్రేణ ముఖై శ్శేషోమునపత్ స్తౌతి యద్గుణాన్॥

కాకతి గణపతిదేవ చక్రవర్తి ఈ భూమిని అజాత శత్రువుగను, నిర్వైరముగను పాలించుచుండ సహస్ర ఫణములుగల ఆదిశేషు వాతనిని వేనోళ్ళ పొగడుచున్నాడు.

మల్యాల గుండసేనాని వర్ణనమున

ఆకారతోరతిపతిస్స్వయమేవ యోఽసౌ
వీరః ప్రచండ చరితః పరమేష భేదః
అస్త్రీ కరోతి మదస్సమరాంగణే స్త్రీ
ర్వీరానయంతు కురుతేస్త్ర ధరానపి స్త్రీః

అని చెప్పెను.

ఆదౌయస్య నికామ హేమ శిఖరం జ్ఞాత్వాసమాలోచ్యత
త్కోణై ర్భానురధావరోధన భయాన్మార్గద్వయం వేధ సౌ
నిర్మాయోత్తర దక్షిణాయననిభాదిత్థాం జగత్కల్పితం
నోచేత్ క్షుణ్ణరధోణః కధమిహ స్పష్టం సమాచేష్టతే

గుండసేనాని నిర్మించిన నాగేశ్వరాలయముపై హేమ శిఖరమును గాంచి ఆ శిఖర కోణములతో సూర్య రధ గమనమున కవరోధము కాగలదను భీతిచే విరించి ఈ జగముల ఉత్తరాయ, దక్షణాయనములతో సృజించెను. అట్లుగాకున్న రథ మార్గమున సూర్యు డిట్లెల పయనించును? అని వర్ణింపబడినది.

అభినవ మయూరసూరి నాగేశ్వరాలయ గోపుర శిఖరమును వర్ణించెను.

యస్య ప్రశస్య శిఖరార్పిత హేమ కుంభ
నిష్క్రాంత దీధితి తతిః పుర సుందరీణాం
శ్యామానుజార గమనం వినివారయంతీ
నిద్యో తతే దిన మణే రపరా ప్రభేవ॥

నాగేశ్వతాలయ శిఖరముపై నున్న బంగారు కలశము కాంతి నిశలందు వర్ధమానపుర సుందరీమణులు జారుల చెంతకు వెళ్ళుటను నిరోధించుటకు కూర్చబడిన సూర్యకాంతి వలె ప్రకాశ మానముగ నున్నది. సూర్యుడీరూపమున తన విధి నిర్వహించునట్లు భావించుట కవకాశము గల పరిణామాలంకార మిందు కూర్చబడినది.

ఇట్టి అపూర్వ వర్ణనములతో వర్ధమానపుర, బూదపుర శాసనములను తండ్రి తనయులగు అభినవ మయూరసూరి, ఈశ్వర భట్టోపాధ్యాయులు, రూపొందించినారు మల్యాల గుండదండాధీశుని ఈ బూదపుర వర్ధమానపుర శాసనములందు తెలుగు వచనము ప్రబంధముల యందలి వచన రచనలకు దీటుగా నున్నది.

## వ్యవసాయము - ఆర్థికస్థితి :

మల్యాల వంశీయులకు చెందిన సంకీసపుర, వర్ధమానపుర రాజ్యములందున్న ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయము. గ్రామసీమలయందు రైతులు వ్యవసాయమున కనుకూలమైన తటాకములు, కుంటలు, కాలువలు, బావులు, తదితర నీటి పారుదల సౌకర్యములను కలిగియుండిరి.

వ్యవసాయాభివృద్ధి పైననే ఆనాటి ప్రభుత్వముల, ప్రజల ఆర్థిక స్థితి ఆధారపడియుండెను.

కాకతి రాజులు ప్రజోపయోగ నిర్మాణములం దత్యంత శ్రద్ధ వహించెడివారు. వారి సామంతులును తమ ప్రభువుల ననుసరించినారు.

మల్యాల వంశజులు ప్రజాభ్యుదయమును దేశ సుభిక్షమును గోరి అనేక ప్రజాహిత కార్యములను చేపట్టి నిర్వహించినారు. వ్యవసాయాభివృద్ధికి బృహత్తటాకములు, కుంటలు, చెరువులు, బావులు పంట కాలువలు త్రవ్వించినారు. సంకీన, వర్ధమానపుర రాజ్యము లందనేక నీటి వనరులను కల్పించినారు. రైతుల సంక్షేమమములను గోరి కరువు కాటకములందు వారి కన్నివిధముల సహకరించినారు. ఆనాడు వారు నిర్మించిన తటాకములు, కుంటలు, బావులు నేటికిని నిలిచి యున్నవనిన వారి నిర్మాణరీతులు లెంతటి పటిష్ఠమైనవో తెలియనగును.

కటుకూరు శాసనమును ప్రకటించిన మైలమ తటాకమును త్రవ్వించినది. కొండిపర్తి శాసనమును వేయించిన చౌండసేనాని చౌండ సముద్రమును త్రవ్వించెను. అట్లే మల్యాల గుండ దండాధీశుడు తన తల్లిపేర బాచసముద్రమును, తనభార్య కుప్పాంబిక పేర కుప్ప సముద్రమును గణపతిదేవ చక్రవర్తి పేర గణప సముద్రమును నిర్మించుచు శాసనములను ప్రకటించెను.

దొడ్ల కాలువ, బుధుని కుంట వంటి అనేక బృహత్తటాకములను, కుంటలను, చెరువులను, కాలువలను త్రవించి వ్యవసాయాభివృద్ధికి తోడ్పడిరి.

కుప్పసానమ్మ నూతులు, పశువులకు నీటి కుంటలు, అనేక నీటివనరు లేర్పరచి, శివాలయములను ప్రతిష్టించి, తోటలు వేయించి, చెరువులను త్రవ్వించి, విష్ణు విగ్రహములను, శివాలయములను ప్రతిష్టించి అనేక సత్కార్యము లొనర్చిన పుణ్యమూర్తి.

కుప్పాంబిక అనేక పర్యాయములు మంచివారికి, కులీనులకు, దీనాంధకృపణులకు స్వర్ణము, రథములు, గుఱ్ఱములు, అన్నము, ఆవులు, ఇండ్లు, బట్టలు, నీరు, గొడుగులు, పక్కబట్టలు దాన మొనర్చి, మల్యాల గోన వంశములకు కీర్తిని సంపాదించి పెట్టెను.

ఇట్టి సత్కార్యము లాచరించుటకు విశేషముగా ధన మవసరముండును. మల్యాల వంశజులలో స్త్రీలు, పురుషు లిట్టి ప్రజోపయోగ నిర్మాణములను చేపట్టిరనిన వారి రాజ్య ఆర్థిక స్థితిగతులు మెరుగుగా నుండెనని భావింపవచ్చును.



శిథిలాలయము – కొండిపర్తి



నంది – కొండిపర్తి



కొండిపర్తి - శేషశాయి



గణపతి - కొండిపర్తి

ఆనాడు మల్యాల వంశీయులు తటాకాది నీటి వనరులు కల్పించుటవలన రైతులు వరి, గోధుమ, చెఱకు, అల్లం, పసుపు, ఉల్లి వంటి పంటలు పండించుచుండిరి. వెలి పొలములందు జొన్న, వెసలు, సజ్జ తదితర పప్పుదినుసులు పండింపబడుచుండెను

ఫలవృక్షములు, తోటలు ఆనాడు పెంచుచుండిరని కుప్పాంబిక బూదపుర శాసనము వలన తెలియుచున్నది. అరటి తోటలు, మామిడి, జామపండ్ల వృక్షములు పెంచబడుచుండెను.

ఆనాడు వివిధ రకములైన వరిధాన్యము, బెల్లము, పంచదార, నూనె విశేషముగా లభ్యమయ్యేడిది. పశు సంపద అధికము కావున పాడి పరిశ్రమ వృద్ధిలో నుండెను. దేవాలయాలకు రాజనాలు అను ధాన్యము ఫలించు భూములు దానముగా నివ్వబడినవి.

నేత పరిశ్రమ, కలంకారి పరిశ్రమ, ఇనుము,రాగి,కంచు,ఇత్తడి తదితర లోహపరిశ్రమలు వృద్ధిలో నుండెను. సంకీస, వర్ధమానపురము, బూదపురము, కొండిపర్తి తదితర ప్రాంతములందు చేనేత వస్త్ర పరిశ్రమ, కలంకారి పరిశ్రమ వ్యాప్తిలో నుండెను.

**నాణెములు :**

నిష్కమను బంగారు నాణెమానాడు వాడుకలో నుండెను.

అడ్డుగ, వీసక, చిన్నము, రూక అను నాణెములు సంకీస వర్ధమానపుర రాజ్యములందు వ్యాప్తిలో నుండెను.

నిష్క మొక బంగారు నాణెము.

వెండి నాణేము రూక యనబడినది.

1 మాడకు పది రూకలు.

అర్ధరూక - అడ్డుగ యనియు, రూకలో నాల్గవ వంతు పాదికయని పిలుచుచుండిరి.

వీసము, చిన్నము చిన్న నాణెములు; రూకలోని భాగములు ప్రజల వాడుకలో నున్నట్టివి.

మల్యాల వంశీయులు కాకతి రాజుల సామంతులు గావున తమ ప్రభువు లమలుతో నుంచిన నాణెములనే సంకీస, వర్ధమానపుర రాజ్యములందు వాడుకలో నుండునట్లు వ్యవహరించిరి. ఈ రాజ్యములందున్న వర్తకులు, వ్యాపారులు దేశ విదేశములతో వ్యాపార మొనర్చుచుండిరి. సంకీసపురాధీశుల రాజ్యములోని వర్తకులు ఓరుగల్లు పట్టణ ప్రముఖ వ్యాపారులతో సంబంధ బాంధవ్యములు కలిగి యుండిరి. వర్ధమానపుర ప్రాంత వణిజులు, అప్పటి కందూరునాడులోని పెరూరులో వర్తక స్థావరము లేర్పరచుకొని, దేశ విదేశ వ్యాపారము లొనర్చుచుండిరి.

భూ-జల మార్గముల వ్యాపార మానాడు విస్తరిల్లి యుండెను. వర్తకులు నావలపై కృష్ణా నదిపై ప్రయాణించి, సముద్ర తీర రేవుల ద్వారా ప్రాక్పశ్చిమ దేశములలో వ్యాపార మొనర్చుచు విశేషముగ ధన మార్జించుచుండిరి.

## మత పరిస్థితి :

మల్యాల వంశజులు చతుర్థ కులజులు వైదిక మతము నవలంబించినవారు. ఈ వంశీయులు శివాలయములను, వైష్ణవాలయములను నిర్మించి, హరిహరాభేదమును పాటించినారు అనేకమంది విప్రులను, కవులను, పండితులను ఆదరించి పోషించినారు. తెలుగు సాహిత్యాభిమానులు కావున కొన్ని శాసనములను ఆంధ్ర సంస్కృత భాషలలో వేయించినారు.

కటుకూరు శాసనమును ప్రకటించిన మైలమ ఆ శాసనమున సూరన, అయ్యనవోలులో నొక తటాకమును నిర్మించినట్లును; హరిహరులకు, భాస్కరునికి ఆలయమును కట్టించినట్లును తెలుపబడినది.

అట్లే విరియాల వంశోత్పన్న యగు మైలమ మల్యాల వంశజుడగు చౌండసేనాని నుద్వాహమయ్యెను. ఆ శాసనమున చౌండసేనాని ప్రతాపాతిశయములు, దివిసీమ విజయములు రమ్యముగా వర్ణింపబడినవి.

మైలమ కటుకూరులో తన పేర మల్లికార్జునాలయమును, తండ్రి పేర అన్యేశ్వర, తల్లి పేర అయితేశ్వరాలయములను నిర్మించి, ఆలయ పూజాదికములకు భూమిని దానముగ నొసంగి తన భక్తిని ప్రకటించుకొనెను.

అట్లే కొండిపర్తిలో చౌండ సేనాని తన పేర చౌండేశ్వరాలయమును నిర్మించి, అనేక మంది విప్రులకు చౌండపురము నగ్రహారముగా నొసంగెను.

కొండిపర్తిలో శాసనమును ప్రకటించిన కాటసేనాని ప్రోలేశ్వర, రుద్రేశ్వర, హరి ఆలయము లకు భూములను దానమిచ్చుటయే గాక నతడు తన యేలిక రుద్రదేవుని పేర రుద్రేశ్వరాలయమును విష్ణు భక్తిచేత హరికొక గుడిని అంతకు ముందున్న ప్రోలేశ్వరాలయమును రమ్యాతిరమ్యముగా రూపొందించి భూదానము లొసంగెను.

అట్లే మల్యాల గుండసేనాని వర్ధమాన పురములో నాగేశ్వరాలయమును ప్రాకార గోపుర సహితముగా నిర్మించి, దాని పూజాదికములకు అంగరంగ భోగములకు, పినలట్టి గ్రామము నగ్రహారముగ నొసంగెను.

అతడు బూదపురములో బాస్సాని. కుప్ప సముద్రములను నిర్మించి, వాటి క్రింద బ్రాహ్మణు లకు ఆలయములకు భూములను దానమిచ్చెను. అతడు తన యేలిక గణపతి దేవ చక్రవర్తి పేర బృహత్తటాకమును నిర్మించి, అనేకమంది విప్రులకు భూ దాన మొసంగెను

గుండసేనాని భార్య కుప్పాంబిక, భర్త మరణానంతరము బూదపురమం దతని పేర గుండేశ్వరాలయమును నిర్మించి, చీల జియ్యలకు వంశపారంపర్యముగ ననుభవించునట్లు భూదాన మొసంగెను.

ఆనాటి పాలకులే గాక ప్రజలు సైతము వైదిక, వైష్ణవమతములనాదరించి పోషించిరి మత సంబంధమైన ఘర్షణలా నాడున్నను నవి మల్యాల వంశీయుల రాజ్యములందున్నట్లు భావించుట కవకాశములేదు.

మల్యాల సామంత రాజవంశపు స్త్రీలు ఉదారగుణములున్నవారు. మైలమ, కాచమ, ఆచమ, బాచమ, కుప్పాంబికలు మహాపతివ్రలు కుప్పాంబిక సకల గుణములు గల నారీమణియని బూదపుర శాసనము వెల్లడించుచున్నది.

ఆమె హైందవ సంప్రదాయము ననుసరించి తన పతివ్రతా ధర్మముల నతి శ్రద్ధతో నిర్వహించెను. అనేక వ్రతములను చేసిన నారీమణి. లక్ష్మీనారాయణ, అశూన్యశయ్య, జలశయన, అనంత అరుంధతీయ, ద్వాదశివంటి అనేక వ్రతములను నిర్వహించిన మహనీయురాలు.

ఆమె బావులు, నీటి కుంటలు, కాలువలు త్రవ్వించినది. శివాలయములను కట్టించినది. చెరువులు త్రవ్వించి, తోటలు వేయించి, ప్రజోపయోగ నిర్మాణములను చేపట్టి నిర్వహించిన కుప్పాంబిక శివలింగములను, విష్ణు విగ్రహములను ప్రతిష్ఠించి తన వైదిక నిరతిని ప్రకటించినది.

ఆమె ఉన్నత వంశీయులకు, సత్ప్రవర్తన గలవారికి, దీనాంధ కృపణులకు బంగారము, అశ్వములు, రథములు, ఆవులు, ఇండ్లు, వస్త్రములు, గొడుగులు, పక్కబట్టలు, ఆహారము, నీరు దానముగా నిచ్చి పుణ్యాత్మురాలని కీర్తి గాంచినది.

ఆనాటి ప్రజలు తీర్థయాత్రలు చేయుటయం దాసక్తిని కనబరచుచుండిరి. కాశీనగరమునకు, గయ, తదితర పుణ్య క్షేత్రములకు వెళ్ళుటకు వీలుగానివారు కొంత భూమిని సమర్థులైన వారికి దానమిచ్చి తమకు బదులుగా నట్టివారిని పంపించుచుండిరి. కుప్పాంబిక బూదపుర శాసనమం దిట్టి ప్రస్తావన యున్నది.

సంకీస వర్ధమానపుర రాజ్యములందు శైవ, వైష్ణవ దేవాలయము లానాడు నిర్మింపబడినవి. కాని అందు శివాలయముల సంఖ్య అధికముగా నుండెను.

కాకతి రుద్రదేవుని పాలనా కాలము నుండి జైనమతము క్షీణింపదొడగినది. శైవమత విజృంభణమువలన, జైనము రాజాదరణము కోల్పోయినది. కాపాలిక జైనమత మావిర్భవించిన పిదప ప్రజల ఆదరాభిమానములకు మతాచార్యులు దూరమైనారు. కాకతి సామ్రాజ్యమున జైనము క్షీణింపదొడగినది కాని మల్యాల వంశీయులకు చెందిన వర్ధమానపుర రాజ్యమున, ఆవంచ, ఆల్వాన్‌పల్లి ప్రాంతములందు శైవ, వైష్ణవ మతములతోపాటు జైనము కూడ ప్రజాభిమానమును పొంది నిలువగలిగినది.

దేవాలయములందు నిత్య పూజలు, నిత్యారాధనలు, అంగరంగ భోగములు, నిత్య నైవేద్యములు సక్రమముగా నిర్వహించుటకు మల్యాల వంశీయులు, నీరు నేల, వెలి పొలము దానముగా నిచ్చుచు శాసనములను ప్రకటించినారు. దేవాలయములందు నియమింపబడిన పూజారులు తగిన భూములను దానముగా పొంది, తమ బిడ్డ బిడ్డ తరము పూజాదికములను నిర్వహించినారు.

## యుద్ధతంత్రము :

మల్యాల, విరియాల వంశీయులు తొలి కాకతి సేనానులలో ప్రథమగణ్యులు. మల్యాల వంశమునం దనేక మంది వీరవరు లుద్భవించిరి అందు దన్నసేనాని, సబ్బసేనాని, కాటసేనాని, పోతసేనాని, చౌండసేనాని, బాచవరూధినీశుడు, గుండదండాధీశుడు ఎన్నదగినవారు. వీరు అసహాయ శూరులు - అరివీరభయంకరులు - అపరిమిత బలపరాక్రమ సంపన్నులు - అజేయులు.

మల్యాల వంశమునకు చెందిన సంకీస, వర్ధమానపుర రాజ్యములు అనేక యుద్ధములందు పాల్గొని కాకతి రాజులకు విజయములు చేకూర్చి వారి అనుగ్రహమును పొందినవి.కాకతి సైన్యముల



శివపాదములు శిల్పములు – కొండిపర్తి



శిథిలనందులు – కొండిపర్తి



వర్ధమానపుర దేవాలయము



శిథిలదేవాలయము - వర్ధమానపురము



వర్ధమానపుర దేవాలయము



వీరభద్రుడు – వర్ధమానపురము



వీరగల్లు – వర్ధమానపురము



నాగిని



నాగశిలలు

కాధిపత్యము వహించి, యుద్ధములందు విజయములు సాధించి, స్వామి భక్తి పరాయణులుగా కీర్తి గాంచిన మల్యాల వంశజులు తమ సామంత రాజ్యములను ప్రజానురంజకముగ పాలించినారు.

మల్యాల వంశమున కాద్యుడైన దన్న సేనాని పెదముత్తుగండ బిరుదము కలవాడు. యుద్ధములందు విజయమును సాధించు ఖేచరేంద్రుడుగా ప్రఖ్యాతుడై శత్రువులను సంహరించి వారి భార్యలను దాసీజనులుగా చేసుకొనువాడు. ఇతనికనేక శత్రు సమూహములుండెను. దిగంతములందితని కీర్తి వ్యాపించెను. కల్పవృక్ష సమానుడగు దన్న సేనాని కాకతి రెండవ ప్రోలరాజు కాలము నాటికి మంత్రిగను, దండనాథుడుగను, సామంతుడుగను వ్యవహరించెను.

దుర్జయ కులజుడును, ఖడ్గ విద్యా విశారదుడును నగు దన్నయ మల్యాల వంశ కీర్తి ప్రతిష్టల నినుమడింపజేసెను.

దన్న సేనాని పెద్ద కొడుకు సబ్బచమూపతి. ఇతడు శత్రుసేనలను ఖండించుచు తన మండలాగ్రమునే గాక దండధారియై విపుల విక్రముడై సంగర రంగమునందు విజృంభించి అందరి మనస్సుల నానంద పరచెను.

సబ్బ సేనాని శస్త్రములను ధరించి ఆహవరంగమందు నిలువ శత్రు సైనికులొక్క అడుగును కూడ ముందుకు వేయజాలక అచేతనులై నిలచి యుండెదరు.

కాటసేనాని గొప్ప యశస్సు కలవాడని, అతని కరవాలముచే ఛేదింపబడిన గజముల కుంభస్థలములనుండి ఎగసిన మత్సములవరుసలు గగనమందు వ్యాపింప వాటిని జూచిన శత్రు రాజులు భీతిల్లి ముత్యములను పగటి చుక్కలుగా భావించి తమకు ఓటమి తప్పదని భావించుచుండిరి.

కాటసేనాని యుద్ధరంగమున అపరసూర్యుని వలె ప్రకాశించుచుండెను. అతడు ప్రఖ్యాతమైన శత్రు దుర్గమును జయించి కోటగెలువాత బిరుదమును పొందెను. పెదముట్టుగండ, ఉద్దండ యుద్ధ విశారదుడుగా కొనియాడబడెను.

యుద్ధరంగమున విస్మయము కలుగునట్లతడు తన తీవ్ర ప్రతాపాగ్నిజ్వాలతో మండు కరవాలమును ధరించి, దాని అంచును శత్రు రక్తముతో అరుణ రూపమగునట్లు చేయును. అతని శత్రువులు గజములపై నుండి యుద్ధ మొనర్చుచు, వాటి కుంభస్థలములపై దీర్ఘనిద్ర పొందుచుండిరి. కాట చమూపతి కాకతి రుద్రమదేవుని అమాత్యుడుగను, మందడిగను వ్యవహరించెను.

కాటసేనాని జ్యేష్ఠ తనయుడు పోతసేనాని. అతడు స్థైర్యము కలవాడు. యాచకులకు కామధేనువు వంటివాడు. అతని కరవాలము శత్రువుల రక్తమును త్రాగుచు మాంసమును తినును అని వర్ణింపబడినాడు.

చౌండసేనాని కాటసేనాని సోదరుడు. పరాక్రమ సంపన్నుడు. వీరుడు. ఇతడు దివిసీమపై దండెత్తి చోడియ రాజు నోడించి దివి చూరకార, ద్వీపిలుంఠక బిరుదములు వహించెను. వెలనాటి పృథ్వీశ్వరుని కోశాగారమును స్వాధీనపరచుకొని కాకతి గణపతిదేవున కర్పించిన వీరుడు చౌండసేనాని. కుమారస్వామి వంటి పరాక్రమము గల చౌండసేనాని యుద్ధరంగమున ప్రవేశింప అతని అశ్వముల గిట్టల తాకిడికి పగిలిన భూమిపైనుండి లేచిన దుమ్ముచేత సూర్యకాంతి కప్పబడుచుండెనని వర్ణింపబడినాడు.

చౌండ సేనానిచే వధింపబడి స్వర్గవాసులైన శత్రువులు భీతిల్లుచు అతని యుద్ధ కళా విశారదత్వమును తలపోసి మరల మరల మరణించి దేవత్వమును పొందుచున్నారని చౌండ సేనాని కీర్తి వర్ణింపబడినది.

దన్న సేనాని రెండవ కుమారుడు బాచసేనాని శత్రువుల గర్వమును సర్వమును అణచునట్టి గరుత్మంతుడు. ఇతనికి పెదముత్తు గండ బిరుదమున్నది.

బాచవరూధినీశుని కుమారుడు గుండసేనాని. ఇతడు అసి ముసల, కలయ, కంపణ, ముద్గర, తోమర, ముషిండి, భిండివాల, చక్ర, క్రకచ నారాచకార్ముకాద్యనేక ఆయుధములను ప్రయోగించుటలో నేర్పరితనమున్నవాడు. ఇతడు గొప్ప యుద్ధవీరుడు. కళాపోషకుడు. ఇతని ఆస్థానము మంత్రి పురోహిత సేనాపతి దౌవారిక, మహా ప్రధానానంత సామంత, సుభట, విట విదూషక, పాఠక పీఠమర్దక నట, నర్తక, రసిక, రంజక, వాది వాగ్మి, కవి, గామికి, వంది వైతాళిక, హావక, భావక గాయకాద్యనేకానేక విద్వజ్జనులకు నిలయము.

గుండ సేనాని యుద్ధము, అత్యున్నతమగు అతని రథ ధ్వజముపై నున్న వస్త్రమున చిత్రింపబడిన గరుత్మంతుని గాంచి రాహు గ్రహణ సమయమం దేర్పడిన ఆందోళన అణగిన చిత్తానువృత్తివలన సూర్యచంద్రులా ధ్వజమును ప్రశంసించుచుందురని వర్ణనమున్నది. రాహువు సర్పరూపధారి. గరుడుడు సర్పములకు శత్రువు. గరుడుని గాంచి రాహువు తమను విడిచి పైదొలగునని సూర్యచంద్రుల ఆనందము.

కాకతి సైన్యమునకు నాయకత్వము వహించి యుద్ధములు నిర్వహించిన మల్యాల వంశజులకు కొంత స్వంత సైన్యముండెడిది. ఆ సైన్యము వారి రాజ్య సంరక్షణార్థ ముపయోగపడెడిది. కాకతి సైన్యమున గజ, ఆశ్విక, పదాతి దళములు ప్రముఖముగా నుండెను. ఈ సైన్యములు సైన్యాధ్యక్షుని కనుసన్నలలో మెలగుచు, యుద్ధ విజయమునకు తోడ్పడుచుండెను. కాకతి సైన్యమున గజ సైన్యాధ్యక్షులు, వాహిన్యాధీశులు, పదాతిదళాధ్యక్షులు వేర్వేరుగా నుండిరి. వీరందరిపై సర్వసైన్యాధ్యక్షుడు ఆధిపత్యము వహించుచుండెను.

## శిల్ప సంపద :

మల్యాల వంశీయులకు చెందిన స్త్రీ పురుషులు దేవాలయములను నిర్మించి శాసనములు వేయించినారు. అపురూప శిల్పసంపదతో నొప్పారు దేవాలయములు కొండిపర్తి, వర్ధమానపురము, బూదపురము, సంకీసపురములందు కనిపించును. అవి కొన్ని శిథిలరూపమును పొందినవి. వర్ధమాన పురమందు మల్యాల గుండ దండాధీశుడు నిర్మించిన నాగేశ్వరాలయము నేటికిని నిలిచి పూజాదులను కలిగియున్నది.

కొండిపర్తి శాసనము కాటయసేనాని ఆలయమును నిర్మించి దానమొసంగు సందర్భమున వేయించినట్టిది. అందు-

ప్రాకారో జయతి త్రికూట మఖిలస్థస్తేన నిర్మాపితః
సుశ్లిష్టైః క్రమశీర్షికై రుపచితో నీలోపలైః కల్పితః।
యశ్చాఽలక్షిత సంధి బంధకథనా దేశాశిలాతక్షకైః
సంతక్షేప్స మహీయ సేమివ శిలాం యత్నాత్స ముత్తారితః

అని వర్ణింపబడినది. నల్లసరపు రాళ్ళను నునుపుగ చెక్కించి, స్తంభములను, దూలములను సిద్ధము చేయించి ఆలయమును నిర్మించుటయేగాక నట్టి శిలలతో ప్రాకార కుడ్యములను రాళ్ళ సంధి బంధములు కనిపింపకుండునట్లు నిర్మించుట ఆనాటి శిల్పుల శక్తి సామర్థ్యములకు, శిల్పకళా ప్రావీణ్యమునకు నిదర్శనము. కాటసేనాని నిర్మించిన త్రికూట దేవాలయము శిథిలరూపమున నున్నను రమ్యాతిరమ్యముగ నున్నది. ఒకే బృహచ్ఛిలను చక్కని దేవాలయముగను, ప్రాకారముగను రూపొందించినట్లు శిల్పులు నిర్మించినారని శాసనమున వర్ణింపబడినదాని కనుకూలముగ నీ దేవాలయ శిథిలములను గాంచిన తెలుసుకొనవచ్చును.

సంకీస, కొండిపర్తి, వర్ధమానపురము లందును, బూదపుర మందును మల్యాల వంశజులు నిర్మించిన దేవాలయములం దనేక విగ్రహము లున్నవి. నాగములు చెక్కబడిన శిలలు, నందులు, శక్తిమూర్తులు, గణపతి, వీరభద్రుడు, సప్తమాతృకలు తదితర శిల్పములు మనకీ ప్రాంతములందు గోచరించును.

కాకతీయుల కాలమున నిర్మింపబడిన దేవాలయము లన్నియు గట్టి పునాదులపై నిర్మింప బడలేదు. రామప్ప, పిల్లలమఱ్ఱి, నాగులపాటి అన్నారం, కొండిపర్తి, వర్ధమానపురము, బూదపురము, హనుమకొండ తదితర ప్రాంతములందు నిర్మింపబడిన దేవాలయములన్నియు శిథిల రూపమును పొందినవి. గట్టి పునాదులు లేని ఈ ఆలయమందున్న శిల్ప మపురూపమైనది.

గణపతి :

మల్యాల వంశజులు నిర్మించిన దేవాలయములందున్న గణపతి మూర్తులు సుందరముగ నున్నవి. చతుర్భుజములు గల గణపతి విగ్రహములు, నాగ ఉదర బంధము, మోదక భక్షణము చేయుచున్నట్లున్న వినాయక విగ్రహములు కనులకు విందుగొలుపును.

నటరాజ, మహిషాసురమర్దని, వీరగల్లులు వర్ధమానపురము, సంకీస, కొండిపర్తి గ్రామము లందున్నవి. భైరవ విగ్రహములు, సప్తమాతృకలు చెక్కబడిన విగ్రహములు ఈ దేవాలయములందు కనిపించును. సప్తమాతృకలలో బ్రహ్మ, మహేశ్వరి, వైష్ణవి, కౌమారి, వారాహి, ఇంద్రాణి, చాముండ ప్రతిమలు, ఈ ప్రతిమల కిరు ప్రక్కల గణపతి, భైరవ విగ్రహములు చెక్కబడి యున్నవి. వర్ధమానపురమందున్న శిల్పములలో భద్రకాళి, కోష్ఠ పంజరము, కార్తికేయుడు, ఉమా మహేశ్వరులు, సరస్వతీదేవి, విష్ణువు తదితర విగ్రహములు, శివలింగములు శిథిల రూపమున కనిపించుచుండును.

ఈ అనల్ప శిల్ప సంపదతో కూడియున్న దేవాలయము లానాడు నిత్యపూజలు, నిత్యోత్సవములు, ధూపదీప నైవేద్యాదులతో భక్తులతో నలరారుచుండెడివి.

నేడు వర్ధమానపురములోను, కొండిపర్తి, సంకీస గ్రామములందును అచ్చటచ్చట పడియున్న శిల్ప సంపద విరిగిన నాసికలతో, ముఖములతో, కాళ్ళతో, చేతులతో దర్శన మిచ్చుచు ఆనాటి వైభవమును తలపుకు తెచ్చుచుండును.

—: o :—



వర్ధమానపురము ఆలయము



వర్ధమానపురము ఆలయము



ఆలయమంటపము



చెన్నకేశవాలయము



త్రికూటేశ్వరాలయము

# 1. మైలమ కటుకూరు శాసనము

**శాసనము :**

కరీంనగర్ జిల్లా, పూర్వపు హుజూరాబాదు తాలూకా కటుకూరులోని శివాలయమందున్న శిలా స్తంభముపై నాలుగు ప్రక్కల చెక్కబడియున్న శాసనమిది. శాసనమును మల్యాల చౌండ సేనాని భార్య మైలమ వేయించెను. మైలమ విరియాల వంశమునందుద్భవించిన వనితామణి.

**లిపి :**

శాసనము చెక్కబడిన శిలాస్తంభము ఎత్తైనది. శాసనాక్షరములు గుండ్రఖత్తు అక్షరములు. క్రీ.శ. 13 వ శతాబ్ద్యారంభమునందాంధ్ర దేశమున వాడుకలోనున్న లిపి ఈ శాసనమున వాడబడినది. శాసన లిపి కొండిపర్తి,[1] వర్ధమానపురము,[2] బూదపురము,[3] బొల్లేపల్లి,[4] ఆగామోతుకూరు,[5] తదితర కాకతి శాసనముల లిపిని పోలి యున్నది.

శాసనశిల మొదటి ప్రక్క 50 రెండవ ప్రక్క 52 మూడవ ప్రక్క 52 నాలుగవ ప్రక్క 50 మొత్తము 204 పంక్తులలో చెక్కబడిన శాసనమిది.

**శాసన విషయము :**

శాసనము శక సంవత్సరము 1124 దుందుభినాటిది. కాకతి సామ్రాజ్యమును గణపతి దేవ చక్రవర్తి పాలించుకాలమున ఈ శాసన మొసంగబడినది.

విరియాల వంశమునకు చెందిన రాజుల పేర్లు, వంశక్రమం ఈ శాసనమందు కనిపించును. విరియాల వంశమున కాద్యుడు సూరప్రభువు. అతనికి ప్రోల, మల్ల, బేత అను ముప్వురు తనయులుదయించిరి. అందు బేత ప్రభువుకు నలువురు కుమారులుదయించిరి. వారు సూర, మల్ల, ప్రోల, కొమ్మ నామధేయులు.

---

1. వరంగల్ జిల్లా శాసనములు. నెం. 48, 64 పుట. 131-137, 192-198.
2. మహబూబునగర్ జిల్లా సర్వస్వము నెం. 83 పుట 1026-1033.
3. మహబూబునగర్ జిల్లా సర్వస్వము నెం. 84, 85 పుట. 1034-1048.
4. శాసన సంపుటి పుట. 224 - 228.
5. శాసన సంపుటి పుట 166 - 172.

మల్లభూపతి కుమారు డన్నయ ప్రభువు. అతని తనయ మైలమ మల్యాల వంశజుడగు చౌండసేనానిని వివాహమాడెను.

కటుకూరు శాసనమున మల్యాల వంశ వర్ణన మున్నది. ఈ వంశమున ద[illegible] సేనాని ప్రసిద్ధుడు. అతని తనయుడు సబ్బసేనాని. సబ్బ చమూపతి కుమారుడగు కాటయ [illegible] సేనాని; అమాత్య పదవిని పొందినవాడు.

కాటసేనాని కిరువురు పుత్రులు. అందు పోతరాజు జ్యేష్ఠుడు. చౌండ సేనాని [illegible] వాడు.

విరియాల వంశమునకు చెందిన బేతరాజు కుమారుడు సూరరాజు [illegible] హరి, భాస్కరులకు ఆలయములను నిర్మించి అందు విగ్రహములను ప్రతిష్ఠించెను.

మల్యాల చౌండసేనాని కాకతి గణపతిదేవ చక్రవర్తి ఆజ్ఞానుసారము [illegible] పాల్గొని, కాకతి సేనలకు నాయకత్వము వహించి చోడెరాజును జయించి, ఉవిమూరి [illegible] పొందినట్లు కటుకూరు శాసనమున వర్ణింపబడినది. మైలమ తన భర్త చౌండసేనాని [illegible], శూరత్వమును తెలుపుచు ఈ శాసనమును వేయించినది.

మైలమ శివాలయమును నిర్మించి ఆలయమున పూజాదికములు నిర్వహించుటకు భూమిని, తటాకమును దానమిచ్చిన సందర్భమునం దీ శాసనమును ప్రకటించెను.

ఈ శాసనమున విరియాల, మల్యాల వంశములు వర్ణింపబడినవి






**శాసన కాలము :**

మైలమ వేయించిన కటుకూరు శాసనము సంస్కృత శ్లోకములతో కూడియున్నది. శాసనము శక సంవత్సరము 1124 దుందుభి (క్రీ.శ. 1202) లో నీయబడినది. మల్యాల వంశమునకు చెందిన 7 శిలాశాసనములలో కటుకూరు శాసనము మొదటిది.

## కట్కూరు శాసనము

## మొదటి ప్రక్క

1. శ్రీ ఓం నమశ్శివాయ। దేయా దిష్టం గ
2. ణేశోవః ప్రారంభే నత మూర్ద్ధ్న
3. సు। పౌష్కరాః శీకరా యస్య భజంత్యాచార
4. లాజతాం॥ శ్రీ మద్వరాహ వపుషః పురు
5. షోత్తమస్య దంష్ట్రాగ్ర వసుధాం చ్చలికా
6. చ కా స్తి। హత్వా హిరణ్యా నయనం జలధౌ నిలీ
7. న ముత్త స్థుషః ప్రథిత విక్రమ వైజయం
8. తీ॥ భూయాద్వః ప్రీతయే శంభు స్తాండవే
9. యస్య తన్వతే। ఉచ్చల జ్జాహ్నవీ వారాముత్క

10. రా శ్చామర శ్రియం॥ వర గుణ విరియా
11. ల క్ష్మా భుజా మ స్తి శ స్తం కుల మమల మి
12. లాయాం యత్ర మిత్ర ప్రభావాః। అజ
13. నిషత మహీశాః శారదేందు ప్రకాశైః ప్ర
14. చురతర యశోభిః పూరితా శాంతరాశాః॥
15. ప్రణతి ముదిత శర్వాణాః ప్రశ్రయ షుణ్యగ
16. ర్వాణాః పరహిత కృత దీక్షాః ప్రాజ్ఞ లోకాత్త
17. శిక్షాః। వితరణ జిత కర్ణాః విశ్వ కల్యాణ
18. పూర్ణాః స్సమర ది(జి)త సప త్నా స్సాధు సిద్ధి
19. ప్రయత్నాః॥ తదన్వయే జాయత సూరనా
20. మా మహీపతిః శూర జనస్య సీమా। య
21. స్య ప్రతాపాతపత ప్త గాత్రా భేజు గ్గుహాః
22. వారి వనా న్య మిత్రాః॥ యదాహవే వీరన
23. రేంద్ర ఘస్మరే శర ప్రలూనారి శిరస్సమా
24. వృతే। పలాయనా ద్భీమన్రుపేణ రక్షితః ర
25. థంచి దాత్మా క్షణ జీవితాశయా॥ తత
26. స్త్రిలోకీ తిలకా స్తనూజా స్త్రయ స్త్రివర్గాః
27. ప్రతిమావ తారాః। ప్రజజ్ఞిరే ప్రోల నృపాల
28. మల్లభూ వల్లభౌ బేత మహీపతిశ్చ॥ తత్ర
29. బేతావనీ శస్య సూరమల్ల క్షమాపతిః। ప్రోల కొ
30. మ్మమహీ నాథౌ చత్వారః సూనవో భవన్॥ తత్ర
31. [సూ] ర నృపతి మ్మణాహా బల స్సష్ట మయ్యాన పురే
32. మృడాలయం। నిమ్మణామే సహరి భాస్కరాల
33. యం భూరి వారి చ తడాగ ము త్తమం॥
34. తేషు ద్వితీయోపి గుణై న్నృపాః పాలః స మల్లనామా

35. భవ దద్వితీయ్యః। యస్యాంగ లావణ్య బలా
36. దనంగః కృత్యం జహౌ పంచశర ప్రపంచం॥
37. స్నేహ నిబ్బ౯ర మగాధతా మలం సేతు భేదన
38. విధేః పరాఙ్ముఖం। రాజహంస రమణియ్య
39. మాబభౌ యత్తడాగ మపి యస్య మానసం॥
40. తస్యా భవ న్మహా బాహు రన్నయః క్ష్మాభృతాం
41. వరః। తనయ స్స నయాచారః శూర శ్చా
42. రు గుణాకరః॥ తస్యాసీ ద్దైత మానామ మా
43. నినీ నిజ గేహినీ। రతి మ్మ౯నోభవ స్యేవ సాగర
44. స్యేవ జాహ్నవీ॥ విద్యేవ కీ త్తి౯ం గురు సంప్రదాయా
45. దుద్యోగతో నీతి రివాద్ధ౯ సిద్ధి। సాలబ్ధ పత్యు స్త
46. నయాం కులస్య భూషాయ మాణా మథ మై
47. లమాఖ్యాం॥ మంద సుందర గతం సుభా
48. షితం లోచనాంచల విలోల వీక్షితం। హంస
49. కోకిల మృగైః పృధక్కృతం యత్ర యోగ మ
50. గమ త్పరస్పరం॥

## రెండవ ప్రక్క

1. యా సా వంఘ్రి సరోరుహా ప్రతిపదం వే
2. ల్లద్బు (జా) వల్లికా సుస్నిగ్ధా ధర పల్లవా స్మిత ద
3. లత్కుం దేక్షణేందీవరా। వల్ల్రద్భ్రూ భ్రమ రావ
4. ళిః శితిలస ద్ధమ్మిల్ల కుంజోత్తరా వ్యద్యోతిష్ట
5. సమం సమంతతతయా స్పష్టం వసన్త శ్రీ
6. యా॥ యే సోదరా గుణ జుషోపి వివద్ధ౯ మా

7. నాః కాలక్రమేణ పృధగేవ భవంతి హంత। ల
8. స్యాః పున స్సహ భవా ధృతి నీతి దాక్ష్య లక్ష్మి(ద)
9. యా ప్రభృతయో న విభాగ భాజః॥ గుణై
10. రస్యా స్సమా ద్వితై9ః కామం సంతు కులాంగ
11. నాః। పాతివ్రత్య గుణః శ్రీమానన్వియా దే
12. వ నాన్యయా॥ శిరః పురారే రివ చంద్రలేఖయా
13. దివాకర స్యేవ రుచా దివస్థలం। య యోస్స
14. తం దన్నయ మంత్రిణః కులం మనోజ్ఞ యా
15. భూరి విభూష యిష్యతే॥ చమూపతే ర్దన్న
16. య నామ ధేయాత్స సబ్బ సేనాపతి రుద్బ
17. భూవ। పాత్రాప్పిత స్నేహ దశావలంబాద్యో
18. దీపి మల్యాల కుల ప్రదీపః॥ ఖండయ
19. ని9 పుచమూన్న కేవలం మండలాగ్ర మ (నృ-)
20. స్వరంజయత్। దండ భృద్విపుల విక్రమో (మృ)
21. దే మండలస్య చ నిజస్య యో మనః॥ తతో
22. జనిష్ట మేధావీ కాటయః సంకిసాధిపః। య
23. త్పాణి మగ్రహీ త్పూవ్వం వీరలక్ష్మీః కులస్త్రీ
24. యాః॥ ఆవార్ధి రాయగరుడః పెడముట్టు
25. గండః ప్రఖ్యాత కోటగెలువాత ఇతి క్షమా
26. యాం। ఆంధ్రాది సిద్ధ జయ వాచక నామ ధే
27. యైయ్య స్యోన్నతిః కవి జనైః ప్రథయాం।(బు)
28. భూ (షే)॥ ప్రేమైక విషయః శ్రీమా న్రుద్రదేవ
29. స్య యో భవత్। తస్య వీరా వజా యేతాం కల
30. త్రే ప్రథమే సుతౌ॥ పోతాభిధానః పృతనాధి
31. పో గ్రజ స్త యో రభూ ద్యస్య కృపాణ సంచ

32. రః। యుద్ధాధ్వనా నాక ముపేయుషాం ద్వి
33. షాం యాత్రా సమర్థో జని సార్థవాహకః॥
34. యో నంతర శ్చాండ వరూధినీశ స్సురేజ్య (ధీ)
35. విః క్రమ కార్తికేయః॥ సుదండ నీతిం త
36. మఖండ శక్తి మమాత్య కృత్యే వృత రుద్ర దే
37. వః॥ త మేషా సంకి సాదీశ వంశ వారాశి
38. వర్ధనం। రోహిణీవ జనానంద మిందుం వ
39. వ్రేపతిం సతీ॥ యస్మి న్నూర్జిత విక్రమే గణ
40. పతి క్షోణీపతే (ః) శాసనా జ్జేతుం దక్షిణవారి
41. ధిం జిగమిషౌ చేలుమ్మ నాంని ద్విషాం। కిం
42. చోద్యోగని యోగ వేగి త చమూ యాత్రా
43. భరా భుగ్నయా భూయో భూరి పరాభ
44. వో జల నిధే రుర్వ్యా సమా శంకితః॥ య
45. (స్మై) ప్రస్పంద ధాటీ తురగ ఖుర పుటక్షేప ని
46. ర్భిన్న భూమే రుడ్డీనై ర్ధూలి జాలై రవిరల మఖి
47. త శ్ఛంన సౌర ప్రకాశైః। మా మేష ప్రాప్తరోష స్థ
48. లయతి పరితః కిన్వితి వ్యగ్రితోర్వీ ద్వీపం ప్రాదా
49. దనేకై రుపచిత మణిభి (శ్చేలభూ)పై శ్చ సార్ధం॥
50. అ త్తద్వీపశ్రియః శశ్వ దభూన్మత్సరి భేదినీ
51. యస్య కీర్తి మయీ (దీవిమాల) కాండీతి క
52. హలా॥

## మూడవ ప్రక్క

1. ప్రభవతి న యదీయ విక్రమాగ్నే స్తృణత
2. రు వైరివనా దృతే వివృద్ధ్యై। అల మపి శమ

3. నాయ నాంబు రాశిః ప్రధన హతారి వధూ
4. జనాశ్రుణోన్యః॥ యః ప్రాసాదం సౌధ ఖావ
5. ప్రసాదం సప్రాకారం రాజతాద్రి ప్రకార
6. ం। తుంగోత్సంగం వ్యాతనోద్దేమ శృంగం వి
7. శ్వేశస్య ప్రీతయే శంకరస్య॥ ఏవం ధమ్మ్యే౯న
8. ధమ్మ౯జ్ఞా లబ్ధ్వా జయ్య౯ం సతీ సతీ। న శీలం కే
9. వలం సాస్య వృత్త మాప్యన్వ వత్త౯త॥ ప్రతిష్ఠాపి
10. వ్వి౯ వాహై శ్చ సురా న్స్వామి సురానపి। స
11. ంభా వ్యాచ్చ౯ యతాం శంభో ల్లి౯ంగై స్థావర
12. జంగమే॥ తిథయః ప్రతిపన్ముఖ్యాః కాల
13. స్సర్వో౯ పి తన్మయః కథితః॥ ఇతి సవ౯ కాల
14. సుఖదం తిథి దానమనేక మదిషాతాం॥ తి
15. లగుడ లవణాత్మాః క్షీర వారాజ్య రూపా స్స
16. దధి మధు సితాంగా స్వచ్ఛ౯తాం గాంచసా
17. క్షాత్॥ స్ఫుట మితి దశ ధేనూః ప్రాత్థ౯నా (కా)
18. మధేనూ వ్వి౯ధివ దమల చిత్తా విప్రభక్తావ
19. దత్తాం॥ నాత్మైవ కేవలం యాభ్యాము (భౌ)
20. గోపాయితే కులే। ఉభౌ చలోకా విజితా వి
21. తీయ్యో౯ భయతో ముఖీః॥ అగ్రహార ద్వ
22. యం దత్తం నిగ్రహా యాఖిలైన సాం॥ అ
23. శూన్య శయనే నో చ్చై స్కీ౯త మిష్ట మశూన్య
24. తాం॥ గో భూ హేమాన్న వస్త్రాది దానాని పు
25. న రేనయోః॥ పురుషాయుష మప్య
26. క్త్వా పరిచ్ఛింద్యన్న౯ పండితాః॥ సా కట్టకూరు
27. రితి విశ్రుత నామధేయే గ్రామే తడాగ యు

28. గలం వ్యదధా దుదారం॥ యద్వారి హంస

29. మిధుసై రనుభూయ మానం విస్మార

30. య త్యమల మంబు సురాప గాయాః॥

31. ప్రాసాద త్రయ మేతస్మింశ్చ క్రే సా మైలమా

32. హ్వాయా। ఆరు రుక్షో ర్ధ్వం కీ ర్త్తే ర్వ్వ ర్త్మేవ

33. పరికల్పితం॥ ప్రత్య తిష్ఠి ప దత్రేశం స్వాఖ్య

34. యా మల్లికార్జ్జునం। అన్నేశ్వరం పితుర్న్నా

35. మ్నా మాతు రైతేశ్వరం పరం॥ ప్రాసాద

36. త్రితయ మ భా త్త్రి కూట తుంగం త్రేతాగ్ని

37. ప్రతిమ మహో మహేశ లింగం। జ్యోతిర్బ్భి స్త్రి

38. భిరివ సంభృతై ర శూన్యః క్షోణీస్థ త్త్రి భు

39. వన సార సంగ్రహో న్యః। ప్రాసాదా భా

40. న్తి శంభో ర్ద్ధవళ తమ తయా మైలమాంబా

41. యశోభిః స్నిగ్ధా స్తచ్చిత్త వృత్యా బుధ జన మ

42. హితై స్తచ్చరిత్రై స్సు చిత్రాః। తస్యా స్తుం గాశ్చ

43. గంగాధర చరణ యుగ ప్రీతిభిః పుష్కలా

44. భి స్తేష్ఠా స్నేహేన భర్త్తు స్సహ విపుల దయా దా

45. న దాక్షై ర్మ్మ హిష్ఠాః॥ పర బల భీమ కులాక

46. ర రత్నం రాయ గరుడాఖ్య కుల భూషా। ఏ

47. కం వింశతి మపరాణ్య తిష్ఠిప న్నిర్మ్మల మాథలి

48. (ం)గాని॥ ఏష్వైవ మేక వింశత్యా ప్రతిష్ఠాభిః స్వ

49. (వ)ంశ జాన్। తావతః శివ సాలోక్య మనైషీ ల్లో

50. క నందనా॥ ప్రాకారో భ్రంలిహాకార స్త్రికూ

51. టం పరితో వ్యభాత్। శివధర్మ్మ స్య రక్షార్త్థ మధ

52. ర్మ్మా సేధ (సంవిధిః)॥

## నాల్గవ ప్రక్క

1. ఏకో త్తరాం భవన వింశతి మీశ్వరస్య క షేద
2. ధ జ్జల ధరా నతి వ ర్తమానః। లోకాంత పాల
3. భవనాష్టక మాత్రజుష్టం యో మానసో
4 త్తర గిరిం హస తీవ భూమ్నా॥ స్పష్టం త్రికూ
5. టముఖ నిర్మల విష్ట రేషు దృష్టః ప్రమృష్ట
6. ముకురేష్వివ పార్వతీశః। ఏకోప్యనేక వదు
7. పా కృత లింగ తంత్ర స్సైర్యంత చింత్య మ
8 హిమా వతు మైలమాంబాం॥ జినభ
9. వనమిత శకాబ్దే దుందుభి సంవత్సర త
10. పస్య స ప్తమ్యాం। పూర్వస్యాం నిజ భవనే
11. పశుపతి రై తేశ్వరో తిష్ఠత్॥ య దక్ష భూ
12. మీందు మితాః శకాబ్దకా స్తదాపరే దేవ
13. వరా వతిష్ఠిపత్। సా మైల మాన్నేశ్వర మల్లి
14. కార్జునే రాకాదినే క్రోధన మా(ఘ)మధ్య
15. మే॥ అదా ద్దేవాంగ భోగాయ శాలి శాలీని
16. సాదశ। నివ ర్తనాని వాంఛంతీ సంసారా ర్తే
17. న్నివ ర్తనం॥ మౌర్గీన తిల్యక నివ ర్తన వింశ
18. తిం చ పుష్పస్మితామపి మనోరమ పుష్ప
19. వాటీం। అచంద్రతారక మహోదధి మైలమా
20. ంబా వృ త్తీశ్చ విప్రజన సాత్కృ(త్కృ)తవ త్యసంఖ్యాః॥
21. పూర్వదత్తాంద్విజాతిభ్యో యత్నాద్రక్ష యు
22. ధిష్ఠిర మహీమ్మహీభృతాం శ్రేష్ఠ దానాచ్ఛ్రే
23. యో నుపాలనం॥ సామాన్యో యంధర్మ
24. సేతుర్నృపాణాం కాలేకాలేపాల నీయోభవ
25. ద్భిః। ఇత్థం సర్వాన్భావినః పార్థివేంద్రాన్భూ

26. యోభూయో యాచతే రామచంద్రః॥
27. మద్వంశజాః పరమహీపతి వంశజావాపా
28. పాదపేతమనసో భువిభూమి పాలాః।
29. తేపాల యంతు మమధర్మ్మ మిమం సమ
30. గ్రం తేషాం మయావిరచితోంజలి రేష
31. మూర్ద్ధ్ని॥ బహు భిర్వ్వ సుధా దత్తారాజభిః
32. సగరాదిభిః। యస్యయస్య యాదా భూ -
33. మి స్తస్య తస్యతదా ఫలం। స్వదత్తాంపరద
34. త్తాం వాయోహరేత వసుంధరాం। షష్టిం వ
35. ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రి
36. మిః॥ గా మేకాం రత్నికా మేకాం భూమే ర
37. ప్యేక మంగులం। హరన్నరక మాప్నోతి యా
38. వదాభూత సంప్లవః॥ అకరస్య కరాదా
39. నాద్గోసహస్రవధస్మి(ఃస్మృ)తః। సకరస్య కర
40. త్యాగా ద్గోకోటి ఫలమశ్నుతే। స్వదత్తా ద్విగు
41. ణం పుణ్యం పరదత్తాను పాలనాత్ (నమ్)। పరద
42. త్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥ త
43. స్మాత్వయా సహ త్తవం ధనం దేవ ద్విజన్మనా
44. ం। తత్పాలనాత్తు సకలం లభతే వాంఛి
45. తం ఫలం॥ యస్వచ్ఛః కృతిచిత్తవన్నవర సో
46. యో నాటకీయోక్తివ ద్యశ్చాక్షయ్య ఫలప్రద
47. స్త్రిభువనే సత్పాత్రదానోపమం సా తం కా(ట)
48. సముద్ర మూర్జితజలం ప్రాదాత్త డాగంపు(న)
49. న్నా మాంకం శ్వశురస్య దైవతగురు(శ్రీకం)
50. రరంగశ్రియే॥ —

—: o :—

# 2. చౌండ సేనాని కొండిపర్తి శాసనము

**శాసనము :**

ఈ శాసనము వరంగల్ జిల్లా వరంగల్‌కు చేరువలో నున్న కొండిపర్తి గ్రామమందలి శివాలయమున గల శిలా స్తంభముపై నాలుగు ప్రక్కల సంస్కృత భాషలో చెక్కబడి యున్నది.

శాసనము కాకతి గణపతిదేవ చక్రవర్తి పరిపాలనా కాలమున శక సంవత్సరము 1125 రుధిరోద్గారిలో నీయబడినది.

మల్యాల వంశ సంభూతుడును, కాకతి సేనానులలో గొప్ప ప్రసిద్ధి గాంచినవాడునునగు చౌండసేనాని ఈ శాసనమును వేయించెను.

శాసనశిల మొదటి ప్రక్కన 53 పంక్తులు, రెండవప్రక్క 55 పంక్తులు, మూడవప్రక్క 40 పంక్తులు, నాల్గవ ప్రక్క 48 పంక్తులు మొత్తము 196 పంక్తులలో శాసనము చెక్కబడి యున్నది. శాసనాంతమున మంగళమహా శ్రీశ్రీశ్రీ అని వ్రాయబడి యున్నది.

**లిపి :**

ఈ శాసమున వాడబడిన లిపి క్రీ. శ. 13 వ శతాబ్ద్యారంభమున ఆంధ్రదేశమున వాడుకలో నున్న లిపి. శాసన లిపి, కటుకూరు,[1] వర్ధమానపురము,[2] సారంగపాణి దేవుని పానుగల్లు,[3] పెరూరు,[4] హనుమకొండ[5] శాసనముల లిపిని పోలియున్నది. ఇందు గుంత్రడఖత్తు అక్షరములు వాడబడినవి.

---

1. కరీంనగర్ జిల్లా శాసనములు నెం 29. పుట 80 - 87
2. మహబూబునగర్ జిల్లా సర్వస్వము పుటలు. 131 - 137
3. నల్లగొండ జిల్లా సర్వస్వము పుటలు 766 - 779
4. శాసన సంపుటి పుటలు. 173 - 187.
5. వరంగల్ జిల్లా శాసనములు నెం. 36 పుట. 94 - 100

**శాసన విషయము :**

ఈ శాసనము పూర్తిగా సంస్కృత శ్లోకములతో గూడి యున్నది. మల్యాల వంశజుల వృత్తాంతమిందున్నది. క్రి. శ. 1203 లో కొండిపర్తి గ్రామమున శివాలయ నిర్మాణము గావించి శివలింగ ప్రతిష్ఠ యొనర్చు సమయమున ప్రకటింపబడినది. ఆలయ పూజాదికములకు, ధూప దీప నైవేద్యాదులకు అర్చకులకు దానమివ్వబడినట్లు శాసనమందున్నది.

చౌండ సేనాని పేర నిర్మించిన చౌండేశ్వరాలయము శకసంవత్సరము 1125 నాటిది. కొండిపర్తి శాసనము ననుసరించి మల్యాల వంశమున కాద్యుడు దన్న సేనాని. ఇతడు దుర్జయ కులోద్భవుడు.

మల్యాల వంశ ప్రభువులు సంకీస పురవరాధీశ్వరులని శాసనములందు వర్ణింపబడినారు. దన్న సేనాని పదముత్తు గండ బిరుదాంచితుడు.

దన్న సేనాని తనయుడు సబ్బ సేనాని. ఇతడు సంకీస పురవరరాధీశుడని వర్ణింపబడినాడు. ఇతని భార్య ఆచమ. ఈ దంపతులకు గొప్ప బలశాలియు మేధావంతుడును నైన కాట సేనాని జన్మించెను.

కాట సేనాని రుద్రదేవ మహారాజు అమాత్యుడుగ పనిచేసెను. ఇతనికి కోట గెలువాట అనగా కోటను జయించినవాడను బిరుదమున్నది ఇతని భార్య బొల్లమ. ఈ దంపతుల కిరువురు తనయులు. అందు పోతావనీశుడు జ్యేష్ఠుడు. చౌండ సేనాని రెండవవాడు.

చౌండ సేనాని గణపతిదేవ చక్రవర్తి సైన్యమున కధ్యక్షుడు; ఓరుగంటి పుర రక్షకుడు.

చౌండ సేనాని అనేక యుద్ధములందు పాల్గొని వివిధ దేశాధీశులను జయించి వారి కోశాగారములను కొల్లగొట్టి కాకతి గణపతిదేవ చక్రవర్తి ధనాగారమును నింపెను.

చౌండ సేనానికి ద్వీపిలుంఠక బిరుదమున్నది. అనగా నితడు కాకతి సైన్యమున కాధిపత్యము వహించి కృష్ణా మండలములోని దివిసీమ నేలు చోడి రాజును జయించెను. అందువలన చౌండ సేనానికి దివి ద్వీపిలుంఠకార బిరుదమేర్పడినది.

చౌండ సేనాని తన పేర చౌండపురమును నిర్మించి బ్రాహ్మణుల కగ్రహారముగ నొసంగెను. ఆ గ్రామ మందొక తటాకమును నిర్మించెను. అది చౌండ సముద్ర మనబడినది.

కొండిపర్తిలో నిర్మించిన ఆలయము చౌండేశ్వరాలయమను పేర ప్రసిద్ధి గాంచినది.

45. ధాత్రాధ్రువం॥ యత్త్రీక్ష్ణాసి విదారిత ద్విపఘటా కుం
46. భస్థల ప్రోచ్చలన్ముక్తా పంక్తియుతం వియద్రిపు
47. (నృ)పాదృష్ట్వా భయాన్మన్యతే। వీక్ష్యంతే విమళాన్యుడూ
48. న్యహనిత న్నిస్సంశయో న్మత్ఖ్కయం స్యాదేవేతి స
49. కేన కోటగెల్వాతాఖ్యః సమః కధ్యతాం॥ నీతస్సురా
50. సురగురుప్రతిమం ప్రయోగే శౌర్యేఋ ధనంజ
51. య దశానన వైరితుల్యం। తం స్వామిభక్తి విష
52. యే నుపమం విదిత్వా శ్రీరుద్రదేవ న్నిపతివ్యఋతనో
53. దమాత్యం॥

## రెండవ ప్రక్క

1. తస్యాసీద్బొల్లమాభిఖ్యా కామినీ ప్రేమభాజనం। స్రిష్ట్వా
2. యాం క్రిత క్రిత్యోభూ ద్వేధా స్త్రీ రూప సంపది॥ త
3. యేషదుపమీయే తదానాంగ రుచిసంపదోః। చేత
4. నా కల్పలతికా యదివిద్యు దచంచలా॥ తయోః
5. పోతాభిధః సూనుర్బ్భూనుబ్భఋందు స్సరోరుహాం। ర
6. త్ననూను స్సదా స్తైర్యేఋ కామధేను ర్ధఋనార్థిఋనాం॥
7. యస్యస్పార స్ఫురిత యశసః శాతధారాసి ధేను
8. ర్య్యుఋద్ధే రీణాం పిబతి రుధిరంమాంసమత్తి ప్రకా
9. మం। యేషాం దృష్టం నయన యుగళే వారివక్త్రై త్రి
10. ణంవా సద్యస్తైభ్యో భవతి విముఖీ ధేను ధర్మ్మఋం
11. విహాయ॥ తస్యానుజో లసత్తేజ స్సహజైర్గ్గుఋణ
12. భూషణైః। భూషిత శ్చౌండసేనాని జ్జఋనానంద సు
13. ధాకరః। మల్యాల నాథవిమలాన్వయ సంభవస్య
14. య స్యారయో గతిభియో నిమిషం పురస్థాః।

15. చిత్రం భవంతి సమరేధిక లాభభాజో యత్వం
16. చతాంత్రిదశతామపి యాంతి భూయః। యస్య
17. శ్రీమద్గణపతి మహీపాల సేనాధిభర్త్తుః స్ఫారై
18. స్సాద్రైః కుందవిశదైరుల్ల సద్భిర్యశోభిః హై
19. మాజాండం భరితమభితః స్వర్ణ్ణలీ నిర్మ్మశార్ణ్ణవః పూ
20. ర్ణ్ణస్స్వర్ణ్ణప్రతను కుతుపాకారమూరీ కరోతి॥
21. శక్తే నరహితకరే సేవితానంత భోగే సత్వోపేతే ద్విజ
22. హితరతే త్రాత గోమండలేచ। ప్రేమోవర్చో ధృతి మ
23. తియుతే చౌంద సేనాధినాధే లక్ష్మీస్సాక్షాద్వ సతి స
24. తతం ప్రీతి యోగేనయత్ర॥ అర్త్థిభ్యః ప్రార్త్థితార్త్థా
25. దధిక మవిరతం వస్తుజాలం దదానం భూలోకే
26. చౌంద సేనాపతి మమల గుణై స్సాకమేకం విధా
27. య। ధాతానాకైక భోగ్య త్రిదశ తరు మరుద్దేను
28. చింతామణీనాం నిర్మ్మాణప్రాప్త నిందాం త్రిజగతి
29. వితతామాత్మనో నిర్మ్మ మార్జ్జ॥ ప్రఖ్యాత చౌండ పు
30. రనామ్ని మహాగ్రహారే దత్తే స్వయం ప్రవర విప్ర క
31. దంబకాయ। స్ఫీతం తడాగ మహ చౌంద సముద్ర
32. సౌంజ్ఞం య స్తంవ్యదత్త విదుతాంబుధి వర్గ్గ గర్వ్వం॥
33. యః ప్రోత్తుంగ తరంగ సంగతి భవ డ్డిండీర పిండచ్ఛ
34. లాత్త్రీరేతార తరేందు మండల మయీం మాలాం స
35. దోత్పాదయన్। భ్రామ్యన్మందర మంథ మంధన వ
36. శాదేకేందు సంభూతిజాం క్షీరాబ్దేర ధరీకరోతి ప
37. రితః కీర్త్తిం జగద్వ్యాపినీం॥ యస్వాసీ త్ప్రేయసీ కాం
38. తా మైలమాఖ్యా మనోరమా। యయారూపగుణై

39. స్సర్వాణ నిర్జితాన్నిజ్జరాంగనాః। గంగా వక్ర గతిర్విర్మా
40. గ్గట గమనా సారుంధతీ సర్వదా భూరేషా చ షుండం।
41. భోగ నిరతా సీతా కుజన్మాతథా। పాంచాలీ బహు వ
42. ల్లభా ప్రనితా జాతా జడాదిందిరా నిర్దోషా గుణిసె
43. చ యస్య గ్రిహిణీ తానూపమేయాకయా॥ గ
44. ణపతి సరపాలః శ్రీపదారాధకస్య ప్రథితగుణ
45. గరిష్టః సంకి సాధీశ్వరస్య। మతి రజని విధాతుం
46. తస్య శంభోః ప్రతిష్ఠాం। శ్రుతి మహిత మహిమ్నస్సర్వ
47. లోకేశ్వరస్య॥ శ్రీ కొండిపత్రి నగరే పెదముట్టుగండ
48. నామ్నాధ చౌండ పృతనాపతినావ్యధాయి। ప్రాసాద
49. ఏషశిఖరే విపులే యదయే పుష్ణాతి హేమకలశః
50. శ్రియమర్క బింబం ప్రాసాదస్య సమున్నతస్య శిఖ
51. రం సువర్ణ ముద్దీప్త దిక్చక్రం భాతిభృశం శివస్య
52. ముకుటాళంకార భూతాంకళాం। చంద్రస్య ప్ర
53. సమీక్ష్య నిర్భరతరా సూయాన్వితో భాస్కరః
54. ప్రాసాదస్య విభూషణాయ కలశీభూయే వ
55. నిత్యం స్థితః।

## మూడవ ప్రక్క

1. విజితసుర విమానస్యాతి చాతుర్య యో
2. గా దమళ విపుళ నీలప్రస్తరైః కల్పితస్య।
3. భువి సకల జనానాం దర్శనా ద్యస్య చిత్రం
4. చిర మనివిషభావో జాయతే జన్మనీహ॥
5. యత్రోత్కీర్ణాః కరణకుశలైః శిల్పిభిః శాల

6. ఖండిన్నార్ణనాభంగీ రచన రుచిరాః క్వాపిపూ
7. ర్వం నదృష్టాః। అత్యాసంన స్థిరతర మనా వి
8. స్మయా ద్వక్షమాణోధ త్తే లోకా వ్యవిచలత
9 యాకృత్రిమ ప్రేక్షకాభాం॥ లోకాలోకం జ
10. యతి జలధి ద్వీప భూవేష్టనం యోబ్రహ్మాం
11. డౌఘం జరరవివరే బిభ్రతః శంకరస్య। ప్రా
12. సాదస్య ప్రవిహిత ప్రితి బ్బార్ఢ సంరూఢ గ
13. ర్భః ప్రాకారోయం జయతి విశతాం పాప
14. శత్రు ప్రరోధీ॥ శైలేంద్రనీల విమలోపల
15. కల్పితేషు ప్రాకారరమ్య శిఖరేషు సమున్న
16 తేషు। తారాస్ఫురంతి విపుళావిమళ ప్రకా
17. శా దీపావళీ విరచి తేవ సురైః సమంతాత్॥
18. -- హంతి అంతిరాళాపా ఆరచ్చంత తుం
19. గ శిహరాణం। గమణాగమణౌ ఖ్షుణ్ణా
20. గ్గావియా - ర అర రహస్న। శాకాబ్దే తత్వ
21. రుద్రైర్మ్మితిమతి రుధిరోద్గారి వైశాఖ మా
22. సే పంచమ్యాం శుక్లపక్షే సుకృత కృతధి
23. యా చౌండ మంత్రీశ్వరేణ। ప్రాసాదే శ్రీ
24. యుతేస్మిన్నఖిళ సురగురుః స్థాపితః
25. పార్వతీశః శ్రీమచ్చౌండేశ్వరాఖ్యః ఫలమ
26. భిలషితం భక్తిభాజాం వితన్వాన్॥ పాయా
27. న్నిత్యం పశుపతిరయం చౌండసేనాధినాథ
28. ం.... దోరాజత్కనిక నికరాకార కాంతి ర్య్య
29. దీయః॥ త్యా సత్యా శశధర కృతం జాహ్నవీ
30. నీరజానాం బంధం భేత్తుం స్వయముపగతో

31. భాను మాళీవభాతి గౌరీ పీనస్తన తట స
32. మాశ్లేష సంశ్లేషియస్య వ్యూఢే వక్షస్యధి
33. కధవశే కుంకుమం కాంతకాంతి। ధత్తే
34. తారక్షితిధర తతీభాసి చాలాతపాభాం
35. సోయం శంభుః సకలసుజనా న్పాతు
36. చౌండీశ్వరాఖ్యః। చౌండీశ్వరాయ భువన
37. — వ దంగరంగ భోగ ప్రయోగ సకళో
38. త్సవ సిద్ధిహేతోః। శ్రీ చౌండసైన్య పతిరా
39. ధరణీందు తారం గ్రామం సమగ్ర మద
40. దాన్నలుకుటిక్క సౌంజ్ఞం॥

## నాలుగవ ప్రక్క

1. పూర్వైర్ దత్తాంద్విజాతిభ్యోయత్నాద్రక్ష యుధి
2. ష్ఠిర। మహీం మహీభృతాంశ్రేష్ఠ దానాచ్ఛ్రేయో
3. నుపాలనం॥ సామాన్యోయం ధర్మ్మర్ సేతున్నృర్పా
4. ణాం కాలేకాలే పాలనీయోభవద్భిః। సర్వ్వానేతాన్భా
5. వినః పార్థివేంద్రా న్భూయోభూయో యాచతే రామ
6. చంద్రః॥ మద్వంశజా పర మహీపతి వంశజా వా
7. పాపాద పేత మనసోభువి భూమి పాలాః।
8. తేపాలయంతు మమధర్మ్మ మిదం సమస్తం
9. తేషాం మయా విరచితోంజలి రేషమూర్ధ్ని
10. బహుభి ర్వసుధాదత్తా రాజభిస్సగరాదిభిః।
11. యస్యయస్య యదాభూమి స్తస్య తస్యతదా
12. ఫలం॥ శత్రుణాపికృతో ధర్మ్మః। పాలనీయః ప్ర
13. యత్నతః। శత్రురేవహి శత్రుస్స్యాద్ధర్మ్మశ్శత్రు

14. న్న౯కస్యచితు॥ గా మేకాం రత్నికామేకాం భూ
15. మే రప్యేక మంగులం। హరంనరక మాప్నోతి
16. యావదా భూత సంప్లవం॥ స్వదత్తాం పరదత్తాం
17. వా యోహరేత వసుంధరాం। షష్టిం వష౯సహ
18. స్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥ అకరస్య క
19. రాదానా ద్గోసహస్ర వధః స్మృతః। సకరస్య క
20. రత్యాగా ద్గోకోటిఫలమశ్నుతే॥ నహరేత త
21. తో ధీమాన్దనం దేవద్విజన్మనాం। తత్పాలసేన ల
22. భతే సకళం వాంచ్ఛితం ఫలం॥ సమస్తుంగశి
23. రశ్చుంబి చంద్రచామర చారవే। త్రైలోక్యనగ
24. రారంభ మూల స్తంభాయశంభవే॥ అభీష్ట
25. ఫలదస్థాణు రష్టమూ త్తి౯రతీంద్రియః। కా
26. మారిదర్ధ౯నారీశో మహాదేవః సపాతువః॥
27. యచ్ఛ్రీపాద సితాంబుజన్మయుగళం సౌవణ్ణ౯
28. పీఠ ప్రభా బాలాక్క౯ ద్యుతిభాసురం నఖరు
29. చివ్రాత స్ఫురత్కే౯సరం। దేవవ్రాత కిరీట నీల
30. మనిభాలోలాలివృందం వ్యధా ద్దేవేశ శ్చౌండచమూ
31. పతిం గుణనిధిం పాయాత్స చౌండేశ్వరః॥ య
32. ద్భూతి ప్రపలాయినాం జలనిధి ద్వీపప్రశితాంభూ
33. భృతాం స్వేదాంభః సరిదోఘ సంగకలిలః
34. ప్రాయోభవత్సాగరః। నోచేత్స్వాదు నదీ ప్రవా
35. హ నివహైరాపూయ్య౯మాణస్య తత్తోయం
36. పాపహరస్యతాదృశమభూత్క స్మాదక స్మాది
37. దం॥ యస్యోత్తుంగ తురంగ నిష్ఠురఖురక్షో
38. ణీ సముద్ఘట్టన ప్రోద్దామోత్థిత సాంద్రధూళి ప

39. టలై రేతైర్భృవే ద్భూతళం। నూనం సాగర వారిణే
40. తిచకితాః ప్రత్యర్థి పృధ్వీభృతః ప్రాజ్యం రాజ్యమ
41. నంత భోగసుభగం త్యక్త్వాదిగంతం గతాః। గం
42. భీరస్యసక్షభూభృదవన స్యోత్కృష్టసత్వస్థితే
43. మ్మయ్యర్దానతిలంఘినో గణపతి క్షోణీపతే
44. య్యర్జ్యతే। రత్నానామపి చాకరత్వ మితి యః
45. ప్రిథ్వీశ కోశాహృతై రత్నైః పూర్ణ్ణ మముష్యకోశ
46. భవనం మల్యాల నాథోప్యదాత్। తతోగణపతి క్షోణి
47. పతిర్న్నామ వ్యధాత్సుధీః। ద్వీపిలుంట్టాక ఇత్యేవం ఖ్యా
48. తం చౌండచమూపతేః॥ మంగళ మహా శ్రీశ్రీశ్రీ॥

—: ౦ :—

# 3. కాటసేనాని కొండిపర్తి శాసనము

**శాసనము :**

ఈ శాసనము వరంగల్ జిల్లాలోని కొండిపర్తి గ్రామమందలి శివాలయము చెంతనున్న శిలాస్తంభముపై నాలుగు ప్రక్కల చెక్కబడి యున్నది. ఈ శాసనము సంస్కృత భాషలో వేయింపబడినది.

శాసనము శిలాస్తంభము నాలుగు వైపుల చక్కని వరుసలలో చెక్కబడినది.

| | | |
|---|---|---|
| శాసనము | మొదటి ప్రక్క | 47 పంక్తులు |
| | రెండవ ప్రక్క | 44 ,, |
| | మూడవ ప్రక్క | 52 ,, |
| | నాల్గవ ప్రక్క | 49 ,, |
| | మొత్తము | 192 పంక్తులలో నున్నది. |

శాసనములోని రెండవ ప్రక్క 44 పంక్తులలోని తొలి అక్షరములు చెడిపోయినవి. శాసనము శక సంవత్సరము 1162 శార్వరి ఫాల్గుణ శుద్ధ ఏకాదశి శనివారము నాడు వేయింప బడినది.

**లిపి :**

శాసనమున క్రీ. శ. 13 వ శతాబ్ది పూర్వార్థమునం దాంధ్ర దేశమున వాడుకలో నున్న లిపి వాడబడినది. శాసనాక్షరములు, హనుమకొండ,[1] పడుమటిపల్లి,[2] పానగల్లు,[3] బూదపూర్,[4] మగతల[5] శాసనాక్షరములను పోలియున్నవి.

---

1. వరంగలు జిల్లా శాసనములు నెం 36 పుట 94 - 100.
2. శాసన సంపుటి పుట. 157 - 158
3 నల్లగొండ మండల సర్వస్వము పుటలు 776 - 779.
4. మహబూబునగర జిల్లా సర్వస్వము నెం. 83 పుటలు 1026 - 1033.
5. మహబూబునగర జిల్లా సర్వస్వము నెం. 92 పుటలు 1064 - 1066.

**శాసన విషయము :**

శాసనమును ప్రకటించిన కాటసేనాని మల్యాల వంశోద్భవుడు. ఇతని తల్లితండ్రులు ఆపమ, సబ్బసేనానులు. మల్యాల వంశజులు దుర్జయకుల సంభవులు.

కాటయసేనాని రెండు దేవాలయములను నిర్మించి దేవరల పూజాదికములకు దాన మొసంగు సందర్భమునం దీ శాసనము నొసంగెను. ఈ ఆలయములలో నొకటి రుద్రేశ్వరము, రెండవది కేశవ దేవాలయము. కొండిపర్తిలో కాటసేనాని ఈ రెండు ఆలయములను నిర్మించు నాటికే ప్రోలేశ్వరాలయము నెలకొని యుండెను. కాటసేనాని ఆ ఆలయమునకు ప్రాకారమును నిర్మించెను.

రుద్రేశ్వరాలయమునకు మూడు నివర్తనముల భూమిని, ప్రోలేశ్వర, కేశవ దేవర ఆలయములకు రెండు నివర్తనముల భూమిని కాట చమూపతి దానముగా నొసంగెను. ఈ భూములు బెల్లమ చెఱువు సీటిపారుదల వసతి గలవి. వర్షాధారముపై ఫలించు 30 నివర్తనముల భూమిని సైతము కాట చమూపతి ఈ ఆలయములకు అంగరంగ భోగములకు దాన మిచ్చెను. కాట చమూపతి గణపతిదేవ చక్రవర్తి సామంతుడు.

కాట చమూపతి భార్య కాచమ. ఇతడు సంకీస పురవరాధీశుడనియు, కోటగెలువాట, పెదముత్తుగండ, దిపచూరకార బిరుదములు కలవాడనియు శాసనమునం దభివర్ణింపబడినాడు.

**శాసన కాలము :**

ఈ శాసనము శక సంవత్సరము 1162 శార్వరి ఫాల్గుణ శుద్ధ ఏకాదశి శనివారము నాడు క్రీ. శ. 1240 - 1241 లో నీయబడినది.

## శాసనము - మూలము

### మొదటి ప్రక్క

1. శ్రీస్వస్త్యస్తు ఓం నమః శివాయ॥ పాతుం స్తన్యాం
2. భవాన్యాస్తన శిరశికృతః ప్రస్నుతక్షీరధారే
3. శ్రీమాన్తానమాద్య న్మధుకర మధురక్వానసన్
4. దబ్భఁగబ్భఁః। గంధవ్యైఁ న్నాఁ రదాద్వైవ్వీఁ కసిత నయ

